శ్రీ ర స్తు.

# రుక్మిణీ కల్యాణము.

## టీకాతాత్పర్యసహితము.



చె న్న పు రి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్ర క టి త ము.

1928.

శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

# రుక్మిణీకల్యాణము

## టీకాతాత్పర్యసహితము.

---



కంఠచాపఖండన
పాకారిప్రముఖవినుత • భండన విలస
త్కాకుత్స్థవంశమండన
రాకేందుయశోవిశాల • రామనృపాలా.

టీ. శ్రీకంఠ = విషమును కంఠమునందుఁగల్గిన శివునియొక్క, చాప = వింటిని, ఖండన = విఱిచినవాఁడా! పాకారి = పాకుఁడను రాక్షసునకు శత్రువైన దేవేంద్రుఁడు, ప్రముఖ = మొదలైనవారిచే, వినుత = పొగడఁబడిన, భండన = యుద్ధముగలవాఁడా! విలసత్ = ప్రకాశించుచున్న, కాకుత్స్థవంశ = కకుత్స్థుని వంశమునకు, మండన = భూషణమైనవాఁడా! రాకేందుయశః = పున్నమచంద్రునిఁ బోలుకీర్తిచేత, విశాల= అతిశయించినవాఁడా! రామనృపాలా=రామరాజా.

తా. శ్రీజానకీమతల్లిని వివాహమాడుటకై శివధనుస్సును తుంటలుగాఁ జేసినవాఁడును, దేవేంద్రుఁడు మొదలైన గొప్పవారిచేఁ బొగడఁబడిన యుద్ధముల నొనర్చినవాఁడును, కకుత్స్థునివంశమునకు భూషణమైనవాఁడును, విశేషకీర్తి గలవాఁడు నగు శ్రీరామచంద్రా.

అవ. గ్రంథకర్త యగుపోతనామాత్యుఁడు శ్రీరామచంద్రస్వామి నుద్దేశించి నమస్క్రియారూపక మగుమంగళమునురచించి, వారితో "విను" మని కథను ప్రారంభించుచున్నాఁడు.—

క. ఆవనజగర్భుపంపున
రైవతుఁ డనురాజు దెచ్చి • రామున కిచ్చెన్
రేవతి యనియెడుకన్యను
భూవర మును వింటికాదె • బుద్ధిం దెలియన్. 2

టీ. ఆవనజగర్భుపంపునన్ = ప్రసిద్ధుండగు బ్రహ్మయాజ్ఞచేత, రైవతుఁడు, అనురాజు, రేవతి, అనియెడుకన్యను, రామునకున్ = బలరామునికి, ఇచ్చెన్, (అనువిషయంబును) భూవర = పుడమిఱేఁడా! (ఇది పరీక్షితుని సంబోధనము), మును = పూర్వము, బుద్ధిన్, తెలియన్ = తెలియునట్లు, వింటికాదె=విన్నావుకావా? (అనఁగా, నీవు విన్నావనుట.)

తా. పరీక్షిన్మహారాజా ! బ్రహ్మయాజ్ఞానుసారముగా నానర్తకదేశపు రాజగురైవతుఁడు తనకూఁతురు రేవతి యనుదానిని దెచ్చి బలరామున కిచ్చి వివాహమును చేసినవిషయమును నవమస్కంధములోఁ జెప్పినదానిని విన్నావు కదా?

భాగవతముయొక్కకథను శ్రీశుకమహర్షి పరీక్షిన్మహారాజునకు నుపదేశించుచున్నాఁడు. నవమస్కంధములో కృష్ణబలరాములు దిగ్విజయమునకై వెడలుటయు, వారి నోడింప జరాసంధుఁడు సైన్యములతోఁ బోయి వారు ప్రవర్షణగిరియం దున్నను గనుఁగొనఁజాలక యాపర్వతమును దహించుటయు కృష్ణబలరాములు ద్వారకకుఁ జేరుటయు మొదలగువానినిఁ జెప్పి, రుక్మిణీ కల్యాణ కథను జెప్ప నుద్యమించి, యంతకుమున్నె బలరామునకును రేవతికిని జరిగిన వివాహమును ప్రస్తావోచితముగ పరీక్షిత్తునకు శుకయోగి జ్ఞాపకమునకుఁ దెచ్చుచున్నాఁడు.—

వ. తదనంతరంబ. 3

టీ. తదనంతరంబ=అటుపిమ్మట.

తా. బలరామునకు రేవతిని వివాహమైనపిదప.

మ. *ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ ము న్ • గైకొన్న
చందంబునన్, జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ • సాళ్వాదు
లన్ గెల్చి భ, ద్రగుఁడై చక్రి వరించె భీష్మకసుతన్ • రాజీ
వగంధిన్ రమా, భగవత్యంశభవన్ మహాగుణమణిన్ •
బాలామణిన్ రుక్మిణిన్. 4

టీ. ఖగనాథుండు=పక్షిరాజు (గరుత్మంతుఁడు), అమరేంద్రున్=దేవేంద్రుని, గెల్చి=జయించి, సుధ=అమృతమును, మున్=పూర్వము, కైకొన్న చందంబునన్=తెచ్చినట్లుగా, చైద్యపక్షచరులన్ = చేదిరాజైన శిశుపాలుని పక్షమునందుండువారిని (అనఁగా: శిశుపాలునిసహాయులు ననుట), సాళ్వాదులన్=సాళ్వుఁడు మొదలుగాఁగల, జగతీనాథులన్=రాజులను, గెల్చి, చక్రి=కృష్ణుఁడు, భద్రగుఁడై = శుభమును బొందినవాఁడై, భీష్మకసుతన్ = భీష్మకరాజుకూఁతును, రాజీవగంధిన్=కమలములవాసనవంటి శరీరవాసనగలదానిని, రమా భగవతీ అంశభవన్ = పూజ్యురాలగు లక్ష్మీదేవియొక్క యంశమునఁ బుట్టినదానిని (లక్ష్మీదేవి యవతారమైనదాని ననుట), మహాత్ గుణమణిన్ = గొప్పరత్నములవంటి గుణములుగలదానిని, బాలామణిన్=రత్నమువంటిబాలికను, రుక్మిణిన్, వరించెన్=కోరెను.

తా. గరుత్మంతుఁడు దేవేంద్రుని జయించి యమృతమును దెచ్చినట్లు కృష్ణుండు శిశుపాలుని కనుకూలు రగురాజులను జయించి కుండిననగరరాజగు భీష్మకునికూఁతును రుక్మిణి యనుదానిని గొనిపోయెను. (అలంకారము- ఉపమ.) [ఖగనాథునివంటికృష్ణుఁడు ఇంద్రునివంటిజరాసంధాదులను గెల్చి

*కశ్యపప్రజాపతిభార్యలగు కద్రూవినతలు ఒకవిషయంబునఁ బంతముపట్టి యందు వినత యోడిపోయి యేనూఱుసంవత్సరములు కద్రువకు దాస్యము చేయుచుండెను. అంతఁ గొన్నాళ్లకు వినతకు గరుడుండు పుట్టి కద్రువకు దాస్యము తొలఁగునట్టియుపాయము వేఁడఁగా నామె అమృతముఁ దెచ్చి యిచ్చిన నీదాస్యము తొలఁగునని చెప్పెను. అప్పుడాగరుడుఁడు స్వర్గమునకుం బోయి ఇంద్రుని గెల్చి యమృతముం గొనివచ్చి కద్రువ కిచ్చెనని భారతము.

యమృతము వంటి రుక్మిణిని దెచ్చెననుటం జేసి యలంకారము లక్షణసమన్వయము.]

వ. అనిన రాజి ట్లనియె. మున్ను రాక్షసవివాహంబున స్వయంవరంబునకు వచ్చినహరి రుక్మిణిం గొని పోయె నని పలికితివి కృష్ణుం డొక్కరుం డెవ్విధంబున సాళ్వాదులజయించి తన పురంబునకుం జనియె నదియునుం గాక. 5

టీ. అనినన్=ఈప్రకారము శుకమహర్షి చెప్పఁగా, రాజు=పరీక్షిత్తు, ఇట్లనియెన్, మున్ను=పూర్వము, స్వయంవరంబునకున్=కన్య తానై తనమగని కోరికొనునట్టి వివాహమునకు, వచ్చిన, హరి = శ్రీకృష్ణుఁడు, రాక్షసవివాహంబునన్=బలాత్కారముగా కన్యనపహరించికొని వచ్చి చేసికొనెడు వివాహవిధిచేత, రుక్మిణిం గొనిపోయెనని పలికితివి. కృష్ణుండు, ఒక్కరుండు=ఒంటిగనే (యితరులసహాయము లేకయే యనుట), ఎవ్విధంబునన్ = ఏరీతిని, సాళ్వాదులన్=సాళ్వుఁడు మొదలుగాఁగలవారిని, జయించి=గెలిచి, తనపురంబునకున్=తనపట్టణమగు ద్వారకకు, చనియెన్=పోయెను. అదియునుం గాక=ఇంతే కాదు (మఱికొంత యున్నదనిభావము.)

శా. కల్యాణాత్మక మైనవిష్ణుకథ లాకర్ణించుచున్ *ముక్తుఁడౌ,
కల్యం డెవ్వఁడు తృప్తుఁడౌ నవి వినం గాఁ గ్రొత్త లౌ
చుండు సా, కల్యం బేర్పడ భూసురోత్తమ యెఱుంగం
బల్కవే రుక్మిణీ, కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌ
తూహలం బయ్యెడిన్. 6

టీ. కల్యాణ ఆత్మకమైన=శుభమగుస్వరూపముగల, విష్ణుకథలు, ఆకర్ణించుచున్=వినుచు, ముక్తుఁడౌ కల్యుండు = ముక్తినిబొందు పుణ్యాత్ముఁడు,

---

* "ముక్తవైకల్యుం డెవ్వఁడు" అని పాఠాంతరము. అప్పుడు, ముక్త=విడువఁబడిన, వైకల్యుఁడు=వికలత్వముగలవాఁడు (అనఁగా: పాపముచే విడువఁబడినటువంటి పుణ్యాత్ముఁడు అనిభావము).

తృప్తుఁడు=తనివిశలవాఁడు, ఎవ్వఁడౌ౯ (ఎవ్వఁడు కాఁడనిభావము.) అవి=అవిష్ణుకథలు, వినంగా౯, శ్రోతలు, ఔచు౯, ఉండు౯, సాకల్యంబు=సకలత్వము (అనఁగా: అంతయునని భావము.) ఏర్పడ౯ = తేటపడునట్లు, భూసురఉత్తమ = బ్రాహ్మణోత్తముఁడా! (ఇది శుకమహర్షి సంబోధనము.) ఎఱుంగ౯=తెలియునట్లు, పల్కవే = చెప్పుమా! రుక్మిణీకల్యాణంబు, వినంగ౯, నాకు౯ (పరీక్షిత్తుకు), మదిలో౯ = మనస్సున, కౌతూహలంబు = కోరిక, అయ్యెడి౯=అగుచున్నది.

తా. శుకమహర్షీ! మేలునొసంగెడు విష్ణుకథలను వినువానికిఁ దృప్తి లేనట్లు, నాకును దృప్తిలేదు. కావున రుక్మిణీకల్యాణమును వినఁగోరెదను.

క. భూషణములు సెవులకు బుధ
తోషణము లనేకజన్మ • దురితౌఘవిని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను • గుణభాషణముల్. 7

టీ. గరుడగమను = గరుడవాహనుని (విష్ణుని), గుణభాషణముల్ = గుణములఁ జెప్పుటలు, చెవులకు, భూషణములు = సొమ్ములు, బుధ = పండితులను, తోషణములు = సంతోషపెట్టునవి, అనేక=పెక్కులగు, జన్మ=పుట్టువులయందలి, దురిత = పాపములయొక్క, ఓఘ = సమూహములను, వినిశ్శోషణములు = మిక్కిలి యెండించునవి (అనఁగాఁ బోఁగొట్టునవి యనుట). మంగళతర=మిక్కిలిశుభముయొక్క, ఘోషణములు=దండూరాలు.

తా. విష్ణుచరిత్రము వీనుల నలంకరించునదియుఁ, బండితులను సంతోషపెట్టునదియుఁ, బాపసమూహమును బోఁగొట్టునదియు నై యున్నది.

వ. అని రాజడిగిన శుకుండి ట్లనియె. 8

టీ. అని=ఈవిధముగా, రాజు = పరీక్షిత్తు, అడిగిన, శుకుంఁడు, ఇట్లనియె=ఈప్రకారముగాఁ జెప్పెను.

చ. వినుము విదర్భదేశమున • వీరుఁడు కుండినభర్త భీష్మకుం
డన నొకదొడ్డరాజు గలఁ • డాతని కేవురు పుత్రు లగ్రజుం

*డనఘుఁడు రుక్మినాఁ బరఁగు • నందఱకుం గడగొట్టుచెల్లెలై
మనుజవరేణ్య పుట్టె నొక • మానిని రుక్మిణినాఁ బ్రసిద్ధయై. 9

టీ. మనుజవరేణ్య = మనుష్యులలో నుత్తముఁడా! (పరీక్షిత్తుసంబోధనము.) వినుము. విదర్భదేశమునన్, వీరుఁడు = శూరుఁడు, కుండినభర్త = కుండిననగరరాజు, భీష్మకుండు, అనన్, ఒక, దొడ్డరాజు = గొప్పప్రభువు, కలఁడు = ఉండెను. ఆతనికిన్ = ఆభీష్మరాజునకు, ఏవురు = అయిదుగురు, పుత్త్రులు=కుమారులు (కలరు. అనిక్రియ యధ్యాహార్యము), అగ్రజుండు = (వారిలో) పెద్దవాఁడు, అనఘుఁడు=పాపములేనివాఁడు, రుక్మినాన్=రుక్మి యనఁగా (రుక్మియనుపేరితో నని భావము.), పరఁగున్=ప్రవర్తిల్లును, అందఱకున్=వారందఱకును, కడగొట్టుచెల్లెలు = కడపటితోఁబుట్టువు, ఆయి, ఒక మానిని = మానముగలది ఒకతె (ఒకయాఁడుది) లేక ఒక యాఁడుబిడ్డ, రుక్మిణి, నాన్=అనుపేరితో, ప్రసిద్ధ ఐ=ప్రకాశించినదై, పుట్టెన్.

తా. విదర్భదేశములోని కుండిననగరమునకు రాజగు భీష్మకునికి రుక్మి మొదలగు నయిదుగురుపుత్త్రులును. అందఱకును గడపటిది రుక్మిణి యనునొక్కకూఁతురుం బుట్టిరి.

క. బాలేందురేఖదోఁచిన
లాలిత యగునపరదిక్కు • లాగున ధరణీ
పాలునిగేహము మెఱసెను
బాలిక జన్మించి యెదుగ • భాసుర మగుచున్. 10

టీ. బాలిక=బిడ్డ (రుక్మిణి), జన్మించి=పుట్టి, ఎదుగన్=పెరుఁగుచుండఁగా, ధరణీపాలుని=భూపాలుని (భీష్మకుని), గేహము=ఇల్లు, బాలఇందురేఖ=

---

* కృష్ణద్వేషియైన రుక్మిని అనఘుఁడని పిలుచుట కడువిపరీతము. ఇచ్చట అనఘశబ్దము ప్రాసము నిమిత్తము వేయఁబడినది గాని, విపరీతలక్షణముచే మహాపాపియగు రుక్మికి అనఘశబ్దవిశేషణమని గాని యూహింపనగు. లేదా కృష్ణసంబంధముచేఁ బవిత్రుఁ డనవచ్చును.

లేఁతచంద్రునికళ, తోఁచిన = ఉదయింపఁగా, లాలిత అగు = కొనియాడఁదగినదగు, అపరదిక్కులాగునన్ = పడమటిదెసవలె, భాసురము = కాంతికలది, అగుచున్, మెఱసెన్ = వెలిఁగెను.

తా. రుక్మిణి పుట్టిపెరుఁగుచుండ నారాజమందిరము విదియచంద్రునితోఁగూడిన పడమటిదిక్కువలెఁ బ్రకాశించెను. (ఉపమ.)

వ. మఱియు దినదినప్రవర్ధమాన యై. 11

తా. దినదినమును వృద్ధిఁ బొందుచున్నదై.

సీ. పేర్వేర బొమ్మల • పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వి•య్యంబు లందు
గుజ్జనగూళ్లను • గొమరొప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁ • జెలువు మెఱయ
రమణీయమందిరా•రామదేశంబులఁ
బువ్వుఁదీఁగెలకును • బ్రోది సేయ
సదమలమణిమయ • సౌధభాగంబుల
లీలతో భర్మడో•లికల నూఁగు

తే. బాలికలతోడఁ జెలరేఁగి • బంతు లాడు
శారికాకీరపంక్తికిఁ • జదువు సెప్పు
బర్హిసంఘములకు మురి•పములు గఱపు
మదమరాళంబులకుఁ జూపు • మందగతులు. 12

టీ. పేర్వేరన్ = పేరుపేరుగా (వేఱువేఱుపేరులతో నని యర్థము), బొమ్మలపెండ్లిండ్లు, సేయుచున్, అబలలతోడన్ = స్త్రీలతో (బాలికలతో నని భావము), వియ్యంబులు = వైవాహికసంబంధములు (పెండ్లిసంబంధములని యర్థము.) అందున్ = పొందును. (బొమ్మలపెండ్లిండ్లు సేయునపుడు ఒకనాఁడు సీతారాముల వివాహంబును, మఱియొకనాఁడు పార్వతీపరమేశ్వర వివాహంబును, ఒకనాఁడు పడుచు నిచ్చునదిగాను, మఱియొకనాఁడు పడుచును పుచ్చుకొనునదిగాను వివాహసంబంధములను చేయుచుండు నని

భావము. బాల్యమున పడుచులు బొమ్మల పెండ్లిండ్లు చేయుట ప్రసిద్ధము. ఇట్లే పైపాదములయందలి కార్యముల నెఱుంగునది.) గుజ్జనగూళ్లను = బాలిక లాడుకొనునప్పుడు గురుగులతో వండినవంటకమును, కొమరు = మనో జ్ఞత, ఒప్పన్ = ప్రకాశించునట్లు, వండించి, చెలులకున్ = తోడిబాలిక లకు, చెలువు = అందము, మెఱయన్ = ప్రకాశించునట్లు, పెట్టించున్, రమణీయము=అందములగు, మందిర = ఇండ్లయొక్క, ఆరామ = తోఁటల యొక్క, దేశంబులన్ = ప్రదేశములయందు, పువ్వుఁదీఁగెలకును, ప్రోది = పోషణమును, చేయున్, సత్ = శ్రేష్ఠములగు, అమల = నిర్మలములగు, మణి మయ=రత్నమయమైన, సౌధ=మేడలయొక్క, భాగంబులన్=ప్రదేశముల యందు, లీలతోన్ = విలాసముతో, భర్మడోలికలన్ = బంగారు టుయ్యా లలయందు, ఊఁగున్, బాలికలతోడన్, చెలరేఁగి=విజృంభించి, బంతులు= చెండ్లు, ఆడున్. శారికా కీరపంక్తికిన్ = గోరువంకలయుఁ జిలుకలయుఁ బంతికి, చదువుచెప్పన్, బర్హిసంఘములకున్ = నెమిలిగుంపులకు, మురిప ములు = నడకలయందలి కులుకులు, కఱపున్ = నేర్పును. మదమరాళంబు లకున్ = మదించిన హంసలకు, మందగతులు = తిన్ననినడకలు, చూపున్ = కనఁబఱచును.

తా. బొమ్మలకు వేఱువేఱుపేళ్లనిడి వానికిఁ బెండ్లికార్యములఁ జేయుఁ చు తనచెలులతో నీలాటి పెండ్లిసంబంధములఁ జేయుటయుఁ, వెన్నెలరాత్రు లయందు చిన్న చిన్న గురుగులలో వంటకము లొనర్చుకొని వానిని తన చెలులతోడఁ గుడుచుటయుఁ, ఇండ్లయందును తోఁటలయందును పూలతీఁగెల నీరును బోసి పెంచుటయుఁ, పరిశుభ్రములగు తనయింటిలో మేడలపైన బంగారు టుయ్యాలలో నూఁగుటయుఁ, తనయీడు బాలికలతోఁ జెండ్లాడు టయుఁ, గోరువంకలకును చిలుకలకును మాటలు నేర్పుటయుఁ, నెమిలి గుంపును హంసలను బెంచుటయుఁ లోనగురుక్మిణిబాల్యావస్థ వర్ణింపఁబడియె.

వ. అంత. 13

సీ. దేవకీసుతుకోర్కి • తీఁగెలు వీడంగ
వెలఁదికి మైదీఁగె • వీడఁదొడఁగెఁ

గమలనాభునిచిత్త ♦ కమలంబు వికసింపఁ
గాంతి నింతికి ముఖ ♦ కమల మొప్పె
మధువిరోధికి లోన ♦ మదనాగ్ని పొడసూపఁ
బొలఁతికిఁ జనుదోయి ♦ పొడవు సూపె
శౌరికి ధైర్యంబు ♦ సన్న మై డాయంగ
జలజాక్షిమధ్యంబు ♦ సన్న మయ్యె
ఆ. హరికిఁ బ్రేమబంధ ♦ మధికంబుగాఁ గేశ
బంధ మధిక మగుచు ♦ బాల కమరెఁ
బద్మనయనువలనఁ ♦ బ్రమదంబు నిండార
నెలఁత యౌవనమున ♦ నిండి యుండె. 14

టీ. దేవకీసుతు = కృష్ణునియొక్క, కోర్కి = మనోరథము, తీఁగెలు వీడంగన్ = వృద్ధిపొందఁగా, వెలఁదికిన్ = స్త్రీకి (రుక్మిణికి), మైదీఁగె = తీఁగెవంటిశరీరము, వీడఁ దొడఁగెన్ = వర్ధిల్లసాగెను. [కృష్ణునికోరికలు కొనసాగుచుండఁగా రుక్మిణికి మేను పెరుగుచుండెనని భావము.] కమలనాభునిచిత్తకమలంబు = కృష్ణుని తామరపువ్వువంటి మనస్సు, వికసింపన్ = పూచుచుండఁగా (సంతోషింపఁగాననుట), కాంతిన్ = ప్రకాశముచేత, ఇంతికిన్ = స్త్రీకి (రుక్మిణికి), ముఖకమలము = కమలమువంటిమోము, ఒప్పెన్ = ప్రకాశించెను. మధువిరోధికిన్ = మధువనురాక్షసుని శత్రువునకు (కృష్ణునికి), లోనన్ = లోపల (మనస్సునందు), మదన అగ్ని = మన్మథతాపము, పొడసూపన్ = కనఁబడుచుండఁగా, పొలఁతికి = స్త్రీకి (రుక్మిణికి), చనుదోయి = చన్నులజంట, పొడసూపెన్ = కనఁబడెను. శౌరికిన్ = కృష్ణునికి, ధైర్యంబు = దిట్టతనము, సన్నము ఐ = తక్కువయై, డాయంగన్ = సమీపింపఁగా, జలజఅక్షి మధ్యంబు = కమలమువంటికన్నులుగల రుక్మిణినడుము, సన్నము ఐయ్యెన్ = సూక్ష్మమాయెను. హరికిన్ = కృష్ణునికి, ప్రేమబంధంబు = విశ్వాసముయొక్కకట్టు, అధికంబుగాన్ = ఎక్కువయగుచుండఁగా, కేశబంధము = కొప్పు, అధికము = ఎక్కువ, బాలకున్ = పడుచునకు (రుక్మిణికి), అమరెన్ = ఒప్పెను.

పద్మనయనువలనన్=కృష్ణుని దిక్కున (కృష్ణునికి), ప్రమదంబు=సంతోషము, నిండారన్=అతిశయింపఁగా, నెలఁత=రుక్మిణి, యౌవనమునన్ = ప్రాయము చేత, నిండి, ఉండెన్.

తా. రుక్మిణిపై కృష్ణునకు కోరిక హెచ్చఁగా రుక్మిణికి శరీరము హెచ్చెను. కృష్ణునికి మనస్సు సంతోషింపఁగా రుక్మిణికి ముఖకాంతి మెండాయెను. కృష్ణునికి రుక్మిణియందలి యనురాగమున మన్మథావస్థ గలుగఁగా రుక్మిణికి కుచయుగ ముబ్బెను. రుక్మిణియందలి యనురాగముచే కృష్ణునకు దిట్టతనము చెదరఁగా రుక్మిణినడుము సన్నగిల్లెను. కృష్ణునకు రుక్మిణియందలి ప్రేమ యొక కట్టుగా నేర్పడ రుక్మిణికి తలవెంట్రుకలుకట్టు కొప్పుగా నేర్పడెను. కృష్ణునికి సంతోష మతిశయింపఁగా రుక్మిణికి ప్రాయ మతిశయించెను.

(ఇచ్చట దేవకీసుతుని కోరికలు పొడముట కార్యము రుక్మిణిశరీరము పొడముట కారణము. కారణమైన రుక్మిణిశరీరముయొక్క వృద్ధి ముందుకలుగ వలసినది. కార్యమగు కృష్ణునికోరికలు వృద్ధి పొందుట వెనుక కలుగవలసినది అట్లు గాక రెంటిని నేకకాలంబున వర్ణించుటవలన, అలంకారము, అక్రమాతిశయోక్తి.)

వ. ఇట్లు రుక్మి రుక్మరథ రుక్మబాహు రుక్మకేశ రుక్మనేత్రు లను నేవురకుం జెలియ లైనరుక్మిణీదేవి తనయొలప్రాయంబున. 15

టీ. ఇట్లు = ఈప్రకారము, రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులు, అనన్=అనునటువంటి, ఏవురకున్ = ఐదుగురికి, చెలియలు, అయిన రుక్మిణీదేవి, తన=తనయొక్క, ఎలప్రాయంబునన్ = యౌవనమునందు.

క. తనతండ్రి గేహమునకుం
జనుదెంచుచు నున్న యతిథిజనులవలనఁ గృ
ష్ణునిరూపబలగుణాదులు
విని కృష్ణుఁడు దనకుఁ దగినవిభుఁ డని తలఁచెన్. 16

టీ. తనతండ్రి, గేహమునకున్ =ఇంటికి, చనుదెంచుచున్న = వచ్చుచున్న, అతిథిజనుల వలనన్ =అభ్యాగతులైన జనులవలన, కృష్ణుని రూప బల గుణ ఆదులు=కృష్ణుని సౌందర్యము పరాక్రమము గుణము మొదలగు వానిని, విని, కృష్ణుఁడు, తనకున్ (రుక్మిణికనుట), తగినవిభుఁడు=తగుమగఁడు, అని, తలఁచెన్ =ఎంచెను.

తా. రుక్మిణి తనతండ్రిగృహమునకు వచ్చువారివలన కృష్ణుని సౌందర్యాదులను విని తనకు కృష్ణుఁడు, తగిన మగఁడు అని తలంచెను.

క. ఆలలనరూపు బుద్ధియు
శీలము లక్షణము గుణము • చింతించి తగన్
బాలారత్నముఁ దనకి
ల్లాలుఁగఁ జేకొందు ననుచు • హరియుం దలఁచెన్. 17

టీ. ఆలలనరూపున్ = ఆ స్త్రీ (రుక్మిణి) యొక్క అందమును, బుద్ధియున్, శీలమున్=మంచినడతను, లక్షణమున్=గురుతును (స్త్రీలక్షణములనుట), గుణమున్=మంచిగుణమును, తగన్=ఒప్పునట్లు, చింతించి=విచారించి, బాలారత్నము=రత్నమువంటిబాలను (రుక్మిణిని), తనకు (కృష్ణునికి అని భావము.) ఇల్లాలుగన్=భార్యయగునట్లు, చేకొందున్ = గ్రహింతును. అనుచు, హరియున్=కృష్ణుఁడును, తలఁచెన్.

తా. కృష్ణుఁడు రుక్మిణిగుణాదులను విని రుక్మిణిం బెండ్లాడెద నని తలంచెను.

వ. అంత. 18

ఉ. బంధువు లెల్లఁ గృష్ణునకు • బాలిక నిచ్చెద మంచు శేముషీ
సింధువులై విచారములు • సేయఁగ వారల నడ్డపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ • జాలవిరోధముఁ జేసి మత్తపు
ష్పంధయవేణి నిత్తు శిశు•పాలున కంచుఁ దలంచె నంధుఁడై.

టీ. బంధువులు, ఎల్లన్=అందఱును, బాలికన్ = పడుచును (రుక్మిణిని), కృష్ణునకున్, ఇచ్చెదము. అంచు = అనుచు, శేముషీసింధువులై =

బుద్ధికి సముద్రములై (ఎక్కువబుద్ధిగలవారలై యనుట), విచారములు = ఆలోచనములు, చేయఁగన్, వారలన్ = ఆబంధువులను, అడ్డపెట్టి = అడ్డగించి, దుస్సంధుఁడు=చెడ్డప్రతిజ్ఞ కలవాఁడు (అగు), రుక్మి, కృష్ణునెడన్ = కృష్ణునివిషయమున, చాలవిరోధము = ఎక్కువపగను, చేసి, మత్తపుష్పంధయవేణిన్=మదించిన తుమ్మెదలవంటి నల్లని జడగలదానిని (రుక్మిణిని), శిశుపాలునకున్, ఇత్తున్, అంచు, అంధుఁడై=గ్రుడ్డివాఁడై (తెలివిలేనివాఁడై), తలంచెన్.

తా. బంధువులు రుక్మిణిని కృష్ణున కియ్యవలెనని ఆలోచించుచుండఁగా దుష్టుండగురుక్మి శిశుపాలున కిత్తునని తలంచెను.

ఉ. అన్నతలంపుఁ దా నెఱిఁగి • యన్నవనీరజగంధి లోన నా
పన్నత నొంది యాప్తుఁ డగు•బ్రాహ్మణు నొక్కనిఁజీరి గర్వసం
ఛన్నుఁడు రుక్మి నేఁడు నను•జైద్యునకిచ్చెదనంచునున్న వాఁ
డెన్నివిధంబులం జని బు•ధేశ్వర చక్రికి విన్నవింపవే. 20

టీ. అన్నతలంపు=అన్న (రుక్మి) యొక్క యాలోచనను, తాను = రుక్మిణి, ఎఱిఁగి, అన్నవనీరజగం =అక్రొత్తకమలముల వాసనవంటి శరీరవాసనగలది (రుక్మిణి), లోనన్=మనస్సునందు, ఆపన్నతన్ = ఆపదను, ఒంది=పొంది, ఆప్తుఁడు = ఇష్టుఁడు, అగు బ్రాహ్మణున్, ఒకని, చీరి=పిలిచి, గర్వసంఛన్నుఁడు=గర్వముచేఁ గప్పఁబడినవాఁడు, రుక్మి, నేఁడు, ననున్, చైద్యునకున్=చేదిదేశపురాజునకు (శిశుపాలునికి), ఇచ్చెదన్, అంచున్, ఉన్నవాఁడు, ఎన్నివిధంబులన్ = ఎన్నిరీతులచేనైనను, బుధేశ్వర=పండితోత్తముఁడా! (బ్రాహ్మణసంబోధనము.)చని=(కృష్ణునియొద్దకుఁ) బోయి, చక్రికిన్=కృష్ణునికి, విన్నవింపవే=మనవిచేయుంమా!

తా. రుక్మిణి అన్నయభిప్రాయము నెఱింగి ఆప్తుఁ డగుబ్రాహ్మణు నొక్కనిం బిలిచి అన్నతలంపును కృష్ణునికిం దెల్పుమని వేఁడెను.

క. అయ్యా కొడుకువిచారము
లయ్యయు వారింపఁ జాలఁ • డటుగా కుండన్

నెయ్య మెఱిఁగించి చీరుము
చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్. 21

టీ. అయ్యా = ఆర్యుఁడా! (బ్రాహ్మణుని సంబోధనము.) కొడుకు విచారములు = కుమారుని యాలోచనలను, అయ్యయున్ = తండ్రియును (భీష్మకుఁడు), వారింపన్ = అడ్డగింపను, చాలఁడు = సమర్థుఁడుగాఁడు, అటుగాకుండన్ = అట్లే ఆకార్యముజరుగకుండ, నెయ్యము = స్నేహము, ఎఱిఁగించి, నిజసేవకానుసారిన్ = తనసేవకుల ననుసరించువాని, శౌరిన్ = కృష్ణుని, చయ్యనన్ = శీఘ్రముగా, చీరుము = పిలువుము.

తా. మాతండ్రియు కుమారుని మాటలను దాఁటలేకున్నవాఁడు కావున నాస్నేహమును కృష్ణునకుఁ దెలిపి పిలిచికొని రావలయును.

వ. అని కొన్ని రహస్యంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకానగరంబునకుం జని ప్రతిహారులవలనఁ దనరాక యెఱింగించి యన్నగధరుం డున్న నగరుఁ బ్రవేశించి యందుఁ గనకాసనాసీనుం డయి యున్నపురుషోత్తముం గాంచి పెండ్లికొడుకవు గమ్మని దీవించిన ముసిముసినగవులు నగుచు బ్రహ్మణ్యదేవుం డైనహరి తనగద్దియ దిగ్గన డిగ్గి బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి తనకు దేవతలు సేయు చందంబునం బూజలు సేసి సరసపదార్థసంపన్నం బైన యన్నంబుఁ బెట్టించి రెట్టించినప్రియంబున నయంబున భాసురుం డైనభూసురుం జేరి లోకరక్షణప్రశస్తం బయినహస్తంబున నతనియడుగులు పుడుకుచు మెల్లన నతని కిట్లనియె. 22

టీ. అని, కొన్ని రహస్యవచనంబులు = రహస్యపుమాటలు, చెప్పినన్, విని, బ్రాహ్మణుండు, ద్వారకానగరంబునకున్ = కృష్ణునిపట్టణమునకు, చని = పోయి, ప్రతిహారులవలనన్ = వాకిటికావలివారిచేత, తనరాకన్ = తన వచ్చుటను, ఎఱింగించి = తెలియఁజేసి, అన్నగధరుండు = ఆకొండతాల్పు (కృష్ణుఁడు), ఉన్ననగరు = ఉన్నట్టిమేడను, ప్రవేశించి = చొచ్చి, అందున్ =

అచ్చట, కనక ఆసనఆసీనుండై=బంగారుగద్దెపైనఁ గూర్చున్నవాఁడై, ఉన్న పురుషోత్తమున్=ఉన్నట్టి పురుషశ్రేష్ఠుని (కృష్ణుని), కాంచి=చూచి, పెండ్లికొడుకవు, కమ్ము=అగుము. అని ఆశీర్వదింపఁగా, ముసిముసినగవులు = చిఱునవ్వులు, నగుచు = నవ్వుచు, బ్రహ్మణ్యదేవుండైన = బ్రాహ్మణులకు హితదేవతయైన, హరి=కృష్ణుఁడు, తనగద్దియన్ = తనసింహాసనమునుండి, డిగ్గనన్ = తటాలున, డిగ్గి=దిగి, బ్రాహ్మణున్=బ్రాహ్మణుని, కూర్చుండన్, నియోగించి=పనిచి, తనకున్=శ్రీకృష్ణునికి, దేవతలు చేయుం, చందంబునన్ = విధమున, పూజలు చేసి, సరసపదార్థసంపన్నంబు = రుచిగలవస్తువులచే నిండినది, ఐన అన్నంబుఁ బెట్టించి, రెట్టించిన ప్రియంబునన్ = ఇనుమడించిన ప్రేమచేత, నయంబునన్ = మెత్తదనముచేత, భాసురుండు = ప్రకాశించువాఁడు, ఐన భూసురున్ = అయినబ్రాహ్మణుని, చేరి = సమీపించి (బ్రాహ్మణుని దగ్గఱకుఁ బోయి అని భావము), లోకరక్షణప్రశస్తంబు = లోకములను గాపాడుటయందుఁ బ్రసిద్ధి కెక్కినది, ఐనహస్తంబునన్ = అయినచేతితో, అతనియడుగులు = ఆబ్రాహ్మణునిపాదములు, పుడుకుచున్ = ఒత్తుచు, మెల్లనన్ = తిన్నఁగా, అతనికి=ఆబ్రాహ్మణునికి, ఇట్లు, అనియెన్.

సీ. జగతీసురేశ్వర ♦ సంతోషచిత్తుండ
వై యున్ననీధర్మ ♦ మతిసులభము
వృద్ధసమ్మత మిది ♦ విత్త మెయ్యది యైనఁ
బ్రాపింప హర్షించు ♦ బ్రాహ్మణుండు
తనధర్మమున నుండు ♦ దరలఁ డాధర్మంబు
కోరిక లతనికిఁ ♦ గురియుచుండు
సంతోషి గాఁడేని ♦ శక్రుఁ డైన నశించు
* నిర్ధనుం డైనను ♦ నిద్రఁ బోవు

---

* "నిర్ధనుం డైనను నింద్రుఁబోలు" నని పాఠాంతరము. ఈ పాఠము సంస్కృతమూలమునకు విరుద్ధమును, యతిభంగమును గలది గావున గర్హితము.

ఆ. సంతసించెనేని • సర్వభూతసుహృత్త
ములకుఁ బ్రాప్తలాభ • ముదితమాన
సులకు శాంతులకును • సుజనులకును గర్వ
హీనులకును వినతు • లే నొనర్తు. 23

టీ. జగతీసురేశ్వర = బ్రాహ్మణోత్తముఁడా! సంతోషచిత్తుండవై = సంతసించిన మనసుగలవాఁడవై, ఉన్ననీధర్మము = ఉండెడి నీప్రవర్తనము, అతిసులభము. ఇది=ఈధర్మము, వృద్ధసమ్మతము = పెద్దలకిష్టమైనది, విత్తము= ధనము, ఎయ్యదియైనన్ = ఏలాటిదైనను, ప్రాపింపన్ = కలుగఁగా, బ్రాహ్మణుండు, హర్షించున్ = సంతోషించును. తనధర్మమునన్=తనఆచారమునందు, ఉండున్, తరలఁడు = తొలఁగఁడు. ఆధర్మంబు = ఆయాచారము (అట్లుసంతోషించియుండుట యనుట.), కోరికలు=ఇష్టములను, అతనికిన్= ఆబ్రాహ్మణునికి, కురియుచుండున్ = కలుగఁజేయుచుండును అనుట. సంతోషిగాఁడువనిన్ = సంతోషములేనివాఁడైన పక్షమున, శక్రుఁడైనన్ = ఇంద్రుఁడైనను, నశించున్=చెడును. సంతసించెనేనిన్ = సంతోషపడినయెడల, నిర్ధనుండైనను=పేదవాఁడైనను, నిద్రవోవున్ = నిద్రించును (సుఖించు నని భావము). సర్వభూత సుహృత్తములకున్ = సర్వప్రాణులకు, పరమమిత్రులకు (భూతదయగలవారి కనుట), ప్రాప్తలాభముదితమానసులకున్ = దొరకినఫలముచే సంతసించినమనసుగలవారికి, శాంతులకును = ఓర్పుగలవారికి (జితేంద్రియులకనుట), సుజనులకును = సత్పురుషులకును, గర్వహీనులకును= అహంకారము లేనివారికిని, వినతులు = నమస్కారములను, ఏన్=నేను (కృష్ణుఁడని యర్థము), ఒనర్తున్=చేయుదును.

తా. బ్రాహ్మణోత్తముఁడా ! సంతసించియున్న నీధర్మము మిక్కిలి యుత్తమమైనది. స్వల్పపదార్థలాభముచే బ్రాహ్మణుఁడు సంతసించియుండువాఁడు. తనయొక్క ఆచారమును వదలినవాఁడు గాఁడు. ఈసంతోషించియుండుటవలననే అతనికోరికలెల్ల కొనసాగుచుండును. సంతోషములేనివాఁడు ఇంద్రుఁడైనను చెడును. సంతోషముగలవాఁడు పేదవాఁడైనను

సుఖించును. కాఁబట్టి భూతదయగలవారును, తమకుఁ గలిగినంతతో తృప్తిఁ జెందినవారును, జితేంద్రియులును, సత్పురుషులును, అహంకారములేని వారునగు తమబోఁటివారికి నే ననేకవందనములు చేయుదును.

ఉ. ఎవ్వనిదేశమం దునికి • యెవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ
కెవ్వనిరాజ్యమందుఁ బ్రజ • లెల్లసుఖింతురు వాఁడుమత్ప్రియుం
డివ్వనరాశిదుర్గమున • కెట్లరుదెంచితి వయ్య నీవు నే
నవ్వులు గావు నీతలఁపు • నం గలమేలొనరింతు ధీమణీ. 24

టీ. ఎవ్వనిదేశమందుఁన్, ఉనికి=నివాసము, ఎవ్వనిచేఁన్, కుశలంబు=క్షేమము, మీకుఁన్, కల్గుఁన్, ఎవ్వనిరాజ్యమందుఁన్, ప్రజలు = జనులు, సుఖింతురు = సుఖమును పొందుదురో, వాఁడు = అట్టిరాజు, మత్ప్రియుండు=నాకిష్టుఁడు. ఇవ్వనరాశిదుర్గమునకుఁన్ = ఈసముద్రము కోటఁగాఁగల ద్వారకకు, ఎట్లు=ఏప్రకారము, అరుదెంచితివి అయ్యా=వచ్చితివయ్యా, నవ్వులు=పరిహాసములు, కావు, నీతలఁపునన్ = నీమనస్సున, కలమేలు = ఉన్న శుభమును, ధీమణీ = బుద్ధియనెడిరత్నముగలవాఁడా! (బ్రాహ్మణునిసంబోధనము) నేఁన్=నేను, ఒనరింతుఁన్=చేయుదును.

తా. బ్రాహ్మణోత్తమా! ఎవ్వనిరాజ్యమందు నీకు నివాసము? ఎవ్వని రాజ్యమునందలి జనులు సుఖముగనున్నారో, అట్టిరాజు నాకిష్టుఁడు. అట్టి దేశమునుండి యీద్వారకకు నెట్లు వచ్చితివి? కార్యముం జెప్పిన నేఁజేసెదను.

వ. అని యిట్లు లీలాగృహీతశరీరుం డైనయప్పరమేశ్వరుం డడిగిన ధరణీసురవరుం డతనికి సవినయంబుగా ని ట్లనియె. దేవా! విదర్భదేశాధీశ్వరుం డగుభీష్మకుం డనురాజు గలండా రాజుకూఁతురు రుక్మిణి యనుకన్యకామణిగలదయ్యిందువదన నీకుం గైంకర్యంబు సేయం గోరి వివాహమంగళప్రశస్తం బయినయొక్క సందేశంబు విన్నవింపు మని పుత్తెంచె నవధరింపుము. 25

టీ. అని, ఇట్లు=ఈప్రకారమున, లీలాగృహీతశరీరుండు = విలాసమునకుఁ బొందఁబడిన దేహముగలవాఁడు(వాస్తవముగా పరమేశ్వరునికి శరీరము లేదని భావము.), ఐన అప్పరమ ఈశ్వరుండు=అయినట్టి ఆపరబ్రహ్మము (కృష్ణుఁడు), అడిగినన్, ధరణీసురవరుండు=బ్రాహ్మణోత్తముఁడు, సవినయంబుగాన్=అడఁకువతోఁగూడినట్లుగా, ఇట్లు, అనియెన్, దేవా=స్వామీ! విదర్భదేశాధీశ్వరుండు = విదర్భనేలువాఁడు, అగుభీష్మకుం డనురాజు, కలండు=ఉన్నాఁడు. ఆరాజుకూఁతురు రుక్మిణి అను, కన్యకామణి=కన్యారత్నము (ఉత్తమకన్యయనుట), కలదు, అయ్యిందువదన = ఆచంద్రునివంటి ముఖముగలది (రుక్మిణి), నీకున్ (కృష్ణునికి), కైంకర్యంబు=ఊడిగము, సేయంగోరి=చేయంగోరికగలదై, వివాహమంగళప్రశస్తంబు = వివాహమను శుభముచేఁ బ్రసిద్ధి నొందినది, ఐనయొక్కసందేశంబు=అయినట్టి యొకసమాచారము, విన్నవింపుము=మనవిచేయుము, అని, పుత్తెంచెన్=పంపెను, (దానిని) అవధరింపుము=చిత్తగింపుము.

సీ. ఏనీగుణములు క•ర్ణేంద్రియంబులు సోఁక
దేహతాపంబులు • దీఱి పోవు
నేనీశుభాకార • మీక్షింపఁ గన్నుల
కఖిలార్థలాభంబు • గలుగుచుండు
నేనీచరణసేవ • లేప్రొద్దుఁ జేసిన
భువనోన్నతత్వంబుఁ • బొందఁ గలుగు
నేనీలసన్నామ • మేప్రొద్దు భక్తితోఁ
దలఁచిన బంధసం•తతులు వాయు
తే. నట్టినీయందు నాచిత్త • మనవరతము
నచ్చి యున్నది నీయాన • నాన లేదు
కరుణఁ జూడుము కంసారి • ఖలవిదారి
శ్రీయుతాకార మానినీ•చిత్తచోర. 26

టీ. ఏనీగుణములు=ఎట్టినీసద్గుణములు, కర్ణఇంద్రియంబులు = చెవులను నింద్రియములు (చెవులసందులు అనిమూలము), సోఁకన్ = తగులఁగా, దేహతాపంబులు=శరీరముయొక్క బాధలు, లీఁటిపోవున్ = తొలఁగునో, ఏనీశుభాకారము = ఎట్టినీమంగళరూపమును, ఈక్షింపన్ = చూడఁగా, కన్నులకున్, అఖిలఅర్థలాభంబులు = సమస్తపురుషార్థములయొక్క లాభములు, అబ్బుచుండున్=కలుగుచుండునో, ఏనీచరణసేవలు = ఎట్టినీయొక్క పాదశుశ్రూషలు, ఏప్రొద్దున్=ఏదినము, చేసినన్, భువనఉన్నతత్వంబున్=లోకమునందు గొప్పతనమును, పొందఁగలుగున్ = చెందఁగలుగునో, ఏనీ లసన్నామము= =ఎట్టినీయొక్క వెలుఁగుచున్న పేరును, ఏప్రొద్దు, భక్తితోన్ = అనురాగముతో, తలఁచినన్, (తడవినన్ అని పాఠాంతరము) బంధసంతతులు=(సంసార) బంధము సమూహములు, వాయున్=తొలఁగునో, అట్టి నీయందున్, నా చిత్తము=నామనస్సు, అనవరతము=ఎల్లప్పుడు, నచ్చియున్నది=నమ్మియున్నది, నీయాన=నీతోడు, నాన=సిగ్గు, లేదు, కంసారి = కంసునిసంహరించినవాఁడా, ఖలవిదారి=దుష్టులనుచీల్చువాఁడా, శ్రీయుతాకార=లక్ష్మితోఁగూడిన ఆకారముగలవాఁడా, మానినీచిత్తచోర=మానవతులగు స్త్రీలమనస్సును దొంగలించువాఁడా (మానముగల స్త్రీలే నిన్నుఁ గోరుదురనిభావము), కరుణన్=దయతో, చూడుము.

తా. నీ గుణములు వినినమాత్రమున శరీరబాధలు దీఱును. నీరూపును కన్నులారఁజూచిన ధర్మార్థకామమోక్షములు లభించును. నీపాద శుశ్రూషల వలన లోకములో గొప్పతనము పొందఁగలుగును. నీనామమును స్మరించువారికి సంసారదుఃఖము తొలఁగును. ఈలాటిగుణములుగలిగిన నీయందు నా మనస్సు చిక్కియున్నది. ఇట్టిలోకోత్తరుని గోరుటలో యీ నామనస్సు సిగ్గునొందలేదు. కాఁబట్టి నన్ను దయతో నేలుకొమ్ము.

శా. ధన్యున్ లోకమనోభిరాముఁ గులవి◆ద్యారూపతారుణ్యసౌ
జన్యశ్రీబలదానశౌర్యకరుణా◆సంశోభితున్ నిన్ను నే
కన్య ల్గోరరు కోరదే మును రమా◆కాంతాలలామంబు రా
జన్యానేకపసింహ నావలననే◆ జన్మించెనే మోహముల్.27

టీ. రాజన్య అనేకపసింహ = రాజశ్రేష్ఠులను నేనుంగులకు సింహమా! ధన్యుఁన్ = పుణ్యముగలవానిని, లోకమనః అభిరాముఁన్ = జనులమనస్సులకు నందమైనవానిని, కుల=వంశము చేతను, విద్యా=చదువు చేతను, రూప = సౌందర్యము చేతను, తారుణ్య = యౌవనము చేతను, సౌజన్య = సుజనత్వము చేతను (మంచితనము చేననుట), శ్రీ=సిరిచేతను (సంపద చేతను), బల=పరాక్రమము చేతను, దాన = ఈవిచేతను, శౌర్య = శూరత్వము చేతను, కరుణా = దయ చేతను, సంశోభితుఁన్=వెలుఁగువానిని, నిన్నుఁన్ = నిన్ను (కృష్ణుననుట), ఏకన్యల్ = ఏపసుచూలు, కోరరు (అందఱుకోరుదురనుట), మును = పూర్వము, రమాకాంతాలలామంబు = లక్ష్మియను స్త్రీరత్నము, కోరదుఎ (కోరినదనుట). నావలననే=నావిషయమునే (నాకుమాత్రమే యని యర్థము), మోహముల్ =వలపులు, జన్మించెన్ ఏ=పుట్టినవా ?

తా. కులవిద్యాదిసంశోభితుని పుణ్యవంతుని నిన్నుఁ గోరని కన్యలు లేరు. పూర్వము పాలసముద్రమునఁబుట్టిన లక్ష్మి మోహముచే నిన్నుఁ గోరినది గదా? అట్లే నేనును నిన్నుఁ గోరితిని. ఇందుచేత నాకులకన్యాత్వమునకు భంగము లేదు.

ఉ. శ్రీయుతమూర్తి యోపురుషసింహమ సింహముపాలిసొ
మ్ము గోమాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు
నీపదాంబుజధ్యాయిని యైననన్ను వడిఁదాఁ గొనిపోయెద
నంచు నున్నవాఁ, డాయధమాధముం డెలుఁగఁ డద్భుత
మైనభవత్ప్రతాపమున్. 28

టీ. శ్రీయుతమూర్తి=లక్ష్మితోఁగూడిన దేహము గలవాఁడా! ఓపురుషసింహమ=ఓపురుషశ్రేష్ఠుఁడా! సింహము పాలిసొమ్ము=సింహముయొక్క భాగమగు సొత్తును, గోమాయువు = నక్క, కోరుచందమునన్ = కోరునట్టి విధముగా, మత్తుఁడు=క్రొవ్వినవాఁడు, చైద్యుఁడు = శిశుపాలుఁడు, నీపదాంబుజధ్యాయినిన్=నీపాదకమలములను దలంచునది, ఐనన్నున్, వడిన్ = వేగముగా, తాన్=తాను (శిశుపాలుఁడు), కొనిపోయెదన్, అంచున్, ఉన్న

వాఁడు, ఆయధమ అధముండు=ఆనీచులలోనీచుఁడు (మిక్కిలి నీచుఁడని భావము), అద్భుతము=ఆశ్చర్యము, ఐనభవత్ప్రతాపముల్=అయినట్టి నీపరాక్రమము, ఎఱుఁగఁడు=తెలిసికొనఁజాలఁడు.

తా. లక్ష్మీసంపన్నుండును పురుషోత్తముండు నగు నోకృష్ణా! సింహము సొత్తును నక్క కోరినట్లు నీసొత్తైననన్ను శిశుపాలుఁడు నీప్రభావముం దెలియక కోరుచున్నాఁడు. అలంకారము-ఉపమ.

మ. వ్రతముల్ దేవగురుద్విజన్మబుధసేవల్ దానధర్మాదులున్
గతజన్మంబుల నీశ్వరున్ హరిజగత్కల్యాణుఁ గాంక్షించి చే
సితి నేనిన్ వసుదేవనందనుఁడు నాచిత్తేశుఁ డౌఁగాక ని
ర్జితులై పోదురుగాక సంగరములోఁ జేదీశముఖ్యాధముల్.

టీ. వ్రతముల్=నియమములు (నోములు), దేవ=దేవతలయు, గురు=ఆచార్యులయు, ద్విజన్మ=బ్రాహ్మణులయు, బుధ=పండితులయు, సేవల్=ఊడిగములు (శుశ్రూషలు), దానధర్మాదులున్=దానములును ధర్మములును మొదలుగాఁగలవానిని (దానమనఁగా ఈవి, ధర్మమనఁగా వేదోక్తవిధుల భేద మెఱుంగునది), గతజన్మంబులన్=కడచినపుట్టువులయందు, ఈశ్వరున్=సర్వేశ్వరుని, జగత్కల్యాణున్=లోకములకు మేలొసంగెడువానిని, హరిన్=విష్ణువును, కాంక్షించి=కోరి, చేసితినేనిన్=ఒనర్చినపక్షమున, వసుదేవనందనుఁడు=వసుదేవునికొడుకు (కృష్ణుఁడు), నాచిత్తఈశుఁడు=నాప్రాణనాయకుఁడు, ఔఁగాక=కావలసినది, చేదిఈశముఖ్యఅధముల్ = చేదిదేశరాజు మొదలుగాఁ గల నీచులు, సంగరములోన్=యుద్ధమునందు, నిర్జితులు ఐ=జయింపఁబడినవారై, పోదురుగాక.

తా. నేను పూర్వజన్మంబున సత్కార్యములు ఈశ్వరప్రీతిగాఁ జేసినయెడల ఈజన్మమునఁ గృష్ణుఁడు నాకు మగఁడు కావలయును. శిశుపాలుఁడు మొదలగువారు యుద్ధమున నోడిపోవలయును.

ఉ. అంకిలి సెప్ప లేదు చతురంగబలంబులతోడ నెల్లి యో
పంకజనాభ నీవు శిశుపాలజరాసుతులన్ జయించి నా

వంకకు వచ్చి రాక్షసవి♦వాహమునన్ భవదీయశౌర్యమే
యుంకువచేసి కృష్ణ పురు♦షోత్తమ చేకొనిపొమ్ము వచ్చెదన్.

టీ. అంకిలి=అడ్డి, చెప్పలేదు, చతురంగబలంబులతోడన్ = నాలుగు అంగములుగల సేనలతో (రథములు, గజములు, గుఱ్ఱములు, కాల్బలములు ఇవి నాలుగు సేనాంగములు), ఎల్లి=రేపు, ఓ పంకజనాభ=కమలము నాభి యందుఁగలవాఁడా (కృష్ణునిసంబోధనము)! నీవు, శిశుపాలజరాసుతు లన్=శిశుపాలుని జరాసంధుని, జయించి, నావంకకున్ = నాదిక్కునకు, వచ్చి, రాక్షసవివాహమునన్ = పెండ్లికూఁతుతలిదండ్రుల యనుమతిలేకయే కన్యకను బలాత్కారముగాఁ గొనిపోయి చేసికొను పెండ్లిరూపముగా, భవదీయశౌర్యమువ = నీపరాక్రమమునే, ఉంకువ = శుల్కము (అల్లుఁడు కన్యకార్థము మామకునిచ్చుధనము), చేసి, కృష్ణ, పురుషోత్తమ = పురుషులలోశ్రేష్ఠుఁడా (కృష్ణునిసంబోధనము), చేకొనిపొమ్ము, వచ్చెదన్.

తా. కృష్ణా! సేనలంగూడి యిచ్చటికి వచ్చి శిశుపాలాదులం గెల్చి నన్నుఁ గొనిపొమ్ము.

సీ. లోపలిసౌధంబు♦లోన వర్తింపంగఁ
దేవచ్చునే నిన్నుఁ ♦ దెత్తునేని
కావలివారలఁ ♦ గలబంధువులఁ జంపి
కాని తేరాదని ♦ కమలనయన
భావించెదేని యు♦పాయంబు సెప్పెద
నాలింపు కులదేవ♦యాత్రఁ జేసి
నగరంబు వెలువడి ♦ నగజాతకును మ్రొక్కఁ
బెండ్లికి మునుపడఁ ♦ బెండ్లికూఁతు
తే. నెలమి మావారు పంపుదు ♦ రేను నట్ల
పురము వెలువడి యేతెంచి ♦ భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నా♦సమయమందు
వచ్చి కొనిపొమ్ము నన్ను న♦వార్యచరిత.

టీ. లోపలిసౌధంబులోనన్ = అంతఃపురంబులోపల, వర్తింపంగన్ = ఉండఁగా, నిన్నున్, తేన్ వచ్చునే = తీసుకొని యెట్లువత్తును? తెత్తునేని = తెచ్చుపక్షమున, కావలివారలన్, కలబంధువులన్ = అచ్చటనున్న బంధువులను, చంపికాని = చంపిననేకాని, తేరాదు = తేఁగూడదు, అని, కమలనయన = కమలమువంటి కన్నులుగలవాఁడా! (కృష్ణునిసంబోధనము) భావించెదు ఏని = తలంతువేని, ఉపాయంబు, చెప్పెదన్, ఆలింపుము = వినుము. కులదేవయాత్రఁ జేసి = కులదైవయాత్ర చేత (కులదేవయాత్రానిమిత్తమని యర్థము), నగరంబున్ = పట్టణమునుండి, వెలువడి = ప్రయాణమై, నగజాతకును = పార్వతీదేవికి, మ్రొక్కన్ = నమస్కరించుటకు, పెండ్లికిమునుపడన్ = పెండ్లికిముందు, పెండ్లికూఁతున్, ఎలమిన్ = సంతోషముతో, మావారు, పంపుదురు, ఏనున్, అట్లుఆ = ఆప్రకారమే, పురమున్ = పట్టణమును, వెలువడి = బయలుదేఱి, ఏతెంచి = వచ్చి, భూతనాథుసతికిన్ = శివునిభార్యకు (గౌరికి), మ్రొక్కంగన్ = నమస్కరించుచుండఁగా, అవార్యచరిత = అడ్డగింపఁగూడనినడవడి గలవాఁడా (మంచినడవడిగలవాఁడా అనుట)! నీవు, ఆసమయమందు, వచ్చి, నన్ను, కొనిపొమ్ము

తా. 'అంతఃపురములో నున్న నిన్ను తెచ్చుట దుర్లభము. ఒక పక్షమున తీసికొని రాఁగలిగినయెడ అచ్చట నున్న కావలివారలను నీబంధులను చంపిననేగాని కార్యము అనుకూలపడదు' అని యోకృష్ణా! నీవు యెంచిన యెడం బెండ్లికిముందుగా కులదైవమునకు మ్రొక్కించుటకుఁగాను పెండ్లికూఁతును పంపుమర్యాద మాలోనున్నది. కాఁబట్టి నేను పార్వతికి మ్రొక్కుటకుఁగాను ఊరిబయట వచ్చినసమయమున నీవువచ్చి నన్ను సులభముగాఁ గొనిపోనగును.

మ. ఘనులాత్మీయతమోనివృత్తికొఱకై • గౌరీశుమర్యాద నె
వ్వని పాదాంబుజతోయమందు మునుఁగన్ • వాంఛింతు రే
నట్టినీ, యనుకంపన్ విలసింపనేని వ్రతచ•ర్యన్ నూఱుజన్మం
బులన్, నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ • నిక్కంబు
ప్రాణేశ్వరా. 32

టీ. ఘనులు=మహాత్ములు, ఆత్మీయతమః నివృత్తికొఱకున్ ఐ=తమసంబంధమగు అజ్ఞానమును బోఁగొట్టుకొనుటకై, గౌరీశుమర్యాదన్ = శివుని పద్ధతిని (శివునివలెననియర్థము), ఎవ్వని పాదాంబుజతోయమందున్ = ఎవని పాదకమలపునీటియందు, మునుఁగన్ = స్నానముచేయుటకు, వాంఛింతురు= కోరుదురో, ఏను, అట్టినీయనుకంపన్ = అట్టి నీదయచేత, విలసింపనేని = ప్రకాశింపనియెడ, వ్రతచర్యన్ = నోములునోఁచుటచేత, నూఱు జన్మంబులన్ = పలుపుట్టువులయందు, నినున్, చింతించుచున్=తలంచుచు, ప్రాణముల్=ప్రాణములను, విడిచెదన్, ప్రాణేశ్వరా=ప్రాణనాథుఁడా! (కృష్ణునిసంబోధనము), నిక్కంబు=(ఇది) సత్యము.

తా. మహాత్ములు తమయజ్ఞానమును బోఁగొట్టుకొనుటకు నేమహాత్ముని పాదజలమును గోరుదురో అట్టినీదయకు నేను యోగ్యురాలను కానియెడల నూఱుజన్మములకైనను నిన్నుఁ దలంచుచుఁ బ్రాణముల వదలెదను.

సీ. ప్రాణేశ నీమంజు•భాషలు వినలేని
 కర్ణరంధ్రంబుల•కలిమి యేల
పురుషరత్నమ నీవు • భోగింపఁగా లేని
 తనులతవలనిసౌం•దర్య మేల
భువనమోహన నిన్నుఁ • బొడగానఁగా లేని
 చక్షురింద్రియముల•సత్త్వ మేల
*దయిత నీయధరామృ•తం బానఁగా లేని
 జిహ్వకు ఫలరస•సిద్ధి యేల

---

*"దయితనీదుకథామృ•తము చవి గొనలేని
జిహ్వకు ఫలరస•సిద్ధి యేల". పా.

టీ. నీదుకథ అమృతము = నీదుకథయను నమృతమును, చవిగొనలేని జిహ్వకున్ =రుచిచూడని నాలుకకు, ఫలరససిద్ధి=పండ్లరసముయొక్క కలిమి, ఏల=నిష్ప్రయోజనము.

ఆ. నీరజాతనయన • నీవనమాలికా
గంధ మబ్బ లేని • ఘ్రాణ మేల
ధన్యచరిత నీకు • దాస్యంబు సేయని
జన్మ మేల యెన్ని • జన్మములకు. 33

టీ. ప్రాణేశ = ప్రాణనాథుఁడా! నీమంజుభాషలు = నీముద్దుపలుకులు, వినలేని కర్ణరంధ్రంబులకలిమి = వినుటకుఁ జాలని చెవిసందులయొక్క యునికి, ఏల? (నిష్ప్రయోజనమని భావము) పురుషరత్నమ = పురుషశ్రేష్ఠమా (కృష్ణునికి సంబోధనము), నీవు, భోగింపఁగాలేని తనులతవలని సౌందర్యము=అనుభవించుటకు నర్హముకాని తీఁగెవంటి మేని సొగసు, ఏల-నిష్ప్రయోజనము. భువనమోహన=లోకములను మోహింపఁజేయువాఁడా! నిన్నుఁ, పొడగానఁగాలేని చక్షురింద్రియముల సత్త్వము = చూచుప్రాప్తి లేని కనులయొక్క కలిమి, ఏల - నిష్ప్రయోజనము. దయిత=ప్రియుఁడా! నీయధర అమృతంబు = నీమోవియందలి తీయఁదనమును, ఆనఁగాలేని=రుచి చూడఁజాలని, జిహ్వకుఁ = నాలుకకు, ఫలరససిద్ధి = పండ్లరసముయొక్క కలిమి, ఏల-నిష్ప్రయోజనము. నీరజాతనయన = కమలమువంటికన్నులుఁగలవాఁడా! (కృష్ణునిసంబోధనము) నీవనమాలికాగంధము=నీతోమాలెయొక్క పరిమళము, అబ్బలేనిఘ్రాణము = పొందలేని ముక్కు, ఏల-నిష్ప్రయోజనము. ధన్యచరిత = పుణ్యపునడతకలవాఁడా! (కృష్ణునిసంబోధనము) నీకుఁ, దాస్యంబుసేయని జన్మము = సేవయొనర్పని పుట్టువు, ఎన్నిజన్మములకుఁ = ఎన్నిపుట్టువులకైనను, ఏల-నిష్ప్రయోజనము.

తా. ఓకృష్ణా! ప్రాణనాథుండవగు నీమాటలు విననిచీనులు నిరర్థకములు. పురుషశ్రేష్ఠుఁడవగు నీశరీరసంపర్కములేని సౌందర్యము వ్యర్థము. నిన్నుఁజూడని కన్నులు నిరర్థకములు. నీమోవి యానని నాలుకకు రుచిదెలియు శక్తిలేదు. నీవనమాలవాసనను గ్రహింపనిఘ్రాణేంద్రియము వ్యర్థము. పుణ్యాత్ముఁడవగు నీ కూడిగముసేయని జన్మము నిరర్థకము. (ఈపద్యమునఁ గవి యింద్రియములవ్యాపారములను వర్ణించినాఁడు)

వ. అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును రూప
సౌందర్యాదివిశేషంబులును బ్రాహ్మణుండు హరికి విన్నవించి
కర్తవ్యం బెద్ది సేయ నవధరింపు మని సవరణగా మఱియు
ని ట్లనియె. 34

టీ. అని, ఇట్లు, రుక్మిణీదేవి, పుత్తెంచిన సందేశంబును = పంపిన సమాచారమును, రూపసౌందర్యఆదివిశేషంబులును = స్వభావము, అందము మొదలుగాఁ గలవానియతిశయములును, బ్రాహ్మణుండు, హరికిన్ = కృష్ణునికి, విన్నవించి = మనవిచేసి, కర్తవ్యంబు = చేయఁదగినది, ఎద్ది=ఏది, చేయన్, అవధరింపుము = ఎచ్చరికచేయుము, అని, సవరణగాన్=సౌమ్యముగా, మఱియున్, ఇట్లు, అనియెన్.

సీ. పల్లవవైభవా॰స్పదములు పదములు
కనకరంభాతిర॰స్కారు లూరు
లరుణప్రభామనో॰హరములు కరములు
కంబుసౌందర్యమం॰గళము గళము
మహితభావాభావ ॰ మధ్యంబు మధ్యంబు
చక్షురుత్సవదాయి ॰ చన్నుదోయి
పరిహాసితార్ధేందు ॰ పటలంబు నిటలంబు
జితమత్తమధుకర ॰ శ్రేణి వేణి
ఆ. భావజాశుగముల ॰ ప్రాపులు చూపులు
కుసుమశరునివింటి ॰ కొమలు బొమలు
చిత్తతోషణములు ॰ చెలువభాషణములు
జలజనయనముఖము ॰ చంద్రసఖము. 35

టీ. పదములు = పాదములు, పల్లవవైభవ ఆస్పదములు = చిగుళ్ళ సంపదకుఁజోటులు, ఊరులు=తొడలు, కనకరంభాతిరస్కారులు=బంగరుటనంటులను తిరస్కరించునవి, కరములు = చేతులు, అరుణప్రభామనోహర

ములు=ఎఱ్ఱనికాంతిచే మనోజ్ఞములు, గళము=కంఠము, కంబు సౌందర్యమం గళము=శంఖముయొక్క సౌందర్యమువలె శుభమైనది, మధ్యంబు=నడుము, మహిత భావ అభావమధ్యంబు=పూజింపఁబడిన సదసత్తులయొక్క నడుము కలది (ఉన్నట్టు లేనట్టు నున్నదని భావము), చన్నుదోయి=చనులజంట, చక్షు రుత్సవదాయి = కనులపండువు సేయునది, నిటలంబు=నుదురు, పరిహసిత అర్ధ ఇందుపటలంబు=తిరస్కరింపఁబడిన యర్ధచంద్రునియొక్క బింబముకలది (అష్ట మిచంద్రునిఁబోలియున్నదని భావము), వేణి=జడ, జితమత్తమధుకరశ్రేణి= గెలువఁబడిన మదించిన తుమ్మెదలబారుకలది, చూపులు=చూడ్కులు, భావజ ఆశుగముల ప్రాపులు = మన్మథునిబాణముల కాశ్రయములు (మన్మథబాణ ములను పోలినవని భావము), బొమలు=కనుబొమలు, కుసుమశరుని వింటిశిఖా మలు=మన్మథుని ధనుస్సుయొక్క శాఖలు (మన్మథధనుస్సును పోలియున్నవని భావము), చెలఁపభాషణములు = రుక్మిణిమాటలు, చిత్తతోషణములు=మన స్సును సంతసింపఁజేయునవి, జలజనయనముఖము = కమలములవంటి కనులు గల రుక్మిణి మోము, చంద్రసఖము=చంద్రునికి సమానమైనది (మోము చంద్రు నిఁబోలినదని భావము).

తా. మృదువైన పాదములును, నున్ననిబంగారుచాయను మించిన తొడలును, ఎఱ్ఱని యఱచేతులును, శంఖములయొక్క అందమును పరిహాస ముఁజేయునటువంటి కంఠమును, ఉన్నదో లేదోయనుసందేహమును గలిగిం చెడునడుమును, కనులపండువు సేయు నురోజంబులును, అష్టమినాఁటిచంద్రు నివంటి మోమును, నల్లని వెండ్రుకలును, మన్మథబాణములఁబోలఁగలచూపులును, మన్మథధనుస్సుఁబోలునట్టి కనుబొమలును గలరుక్మిణియొక్క మాటలు మన స్సును సంతోషింపఁజేయుచున్నవి. ఇంతేకాక యారుక్మిణియొక్క మోము చంద్రునిఁబోలినది.

ఉ. ఆయెలనాఁగ నీకుఁ దగు♦నంగనకుం దగు దీవు మాయుపా
ధ్యాయులయాన పెండ్లియగుఁ♦దప్పదు జాడ్యము లేలనీవునీ
తోయమువారిఁ గూడుకొని♦తోయరుహాననఁ దెత్తుగాని వి

చ్చేయుము శత్రులన్ నుఱుముఁ జేయుము సేయుము శోభ
నం బిలన్. 36

టీ. ఆయెలనాఁగ=ఆ స్త్రీ (రుక్మిణి), నీకున్, తగున్, అంగనకున్=మంచియవయవములుగలదానికి (రుక్మిణికి), ఈవు=నీవు, తగుదు, మాయుపాధ్యాయులయాన=మాగురువులతోడు, పెండ్లి, అగున్, తప్పదు. జాడ్యములు=ఆలస్యములు, ఏల=ఎందులకు, నీవు, నీతోయమువారున్=నీపరివారములు, కొడుకొని, తోయరుహాననన్ = కమలములవంటి నేత్రములు గలదానిని (రుక్మిణిని), తెత్తు=తీసికొనివత్తువు, కాని, విచ్చేయుము=రమ్ము, శత్రులన్=పగవారిని, నుఱుము సేయుము=చూర్ణము చేయుము, ఇలన్=భూమియందు, శోభనంబు=మేలు, చేయుము.

తా. ఓకృష్ణా! రుక్మిణి నీవు పెండ్లియాడఁదగినది. నిన్ను రుక్మిణి పెండ్లియాడఁదగినది. మీకిద్దఱకును దప్పక వివాహముకాగలదు. కనుక నీవేలాటి యాలస్యమును చేయక నీపరివారముతో వచ్చి శత్రువులను పరిమార్చి రుక్మిణిని తెచ్చుటలోఁ బ్రజలకెల్లఱకు మేలుచేయుము.

వ. అని యిట్లు పలికిన బ్రాహ్మణునివలన విదర్భరాజతనయ
పుత్తెంచినసందేశంబును రూపసౌందర్యాదివిశేషంబులును
విని యవధరించి నిజకరంబున నతనికరంబు పట్టి నగుచు
నయ్యాదవేంద్రుం డిట్లనియె. 37

టీ. అని, ఇట్లు, పలికినబ్రాహ్మణునివలనన్ = చెప్పినబ్రాహ్మణునివలన, విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశంబును=భీష్మకునికూఁతురగు రుక్మిణిపంపిన సమాచారమును, రూపసౌందర్యాదివిశేషంబులును=స్వభావము సౌందర్యము మొదలుగాఁగలవాని యతిశయములను, విని, అవధరించి=అంగీకరించి, నిజకరంబునన్=తన చేతితో, అతనికరంబు = బ్రాహ్మణుని చేతిని, పట్టి, నగుచున్, అయ్యాదవేంద్రుండు=ఆయదువంశశ్రేష్ఠుండు (కృష్ణుఁడు), ఇట్లు, అనియెన్.

ఉ. కన్నియమీఁద నాతలఁపు • గాఢము కూరుకు రాదు రేయి
నా, కెన్నఁడు నావివాహము స • హింపక రుక్మి దలంచు కీడు
నే, మున్నె యెఱుంగుదుం * బరుల • మూఁక వధించి కుమారిఁ
దెత్తు విద్వన్నుత ! మ్రానుఁ ద్రచ్చి నవ • వహ్నిశిఖ న్వడిఁ
దెచ్చుకైవడిన్. 38

టీ. కన్నియమీఁదన్=కన్యకపైని(రుక్మిణియందనుట), నాతలఁపు=నాకోరిక, గాఢము = అధికము, కావున్, ఎన్నఁడున్, రేయి = రాత్రి, కూరుకు=నిద్ర, రాదు, రుక్మి, నావివాహమున్, సహింపక=ఓర్వక, కీడు=చెడుఁగును, తలంచున్, నేన్, మున్నె = మునుపే, ఎఱుంగుదున్=తెలియుదును, విద్వన్నుత=పండితులచేఁ గొనియాడఁబడినవాఁడా! (బ్రాహ్మణుని సంబోధనము.) మ్రానున్=జమ్మిచెట్టును, త్రచ్చి=చిలికి, నవవహ్నిశిఖన్=క్రొత్తయగ్నిజ్వాలలను, తెచ్చుకైవడిన్=తెచ్చునట్లు, పరులమూఁకన్=శత్రుసమూహమును, వధించి=చంపి, వడిన్=వేగముగా, కుమారిన్=రుక్మిణిని, తెత్తున్.

తా. పండితోత్తముఁడా ! రుక్మిణివలె నాకును అనురాగము కలదు. కావున యాగముఁజేయువారు జమ్మికొయ్యను జిలికి యగ్నిం దెచ్చునట్లు శత్రువులగెల్చి యారుక్మిణిని తెచ్చెదను.

క. వచ్చెద విదర్భభూమికిఁ
జొచ్చెద భీష్మకునిపురము • సురుచిరలీలం
దెచ్చెద బాలన్ వ్రేల్మిడి
వ్రచ్చెద నడ్డంబు రిపులు • వచ్చినఁ బోరన్. 39

టీ. విదర్భభూమికిన్ = విదర్భదేశమునకు, వచ్చెదన్, భీష్మకునిపురమున్=భీష్మకునిపట్టణమును (కుండినపురమును), సురుచిరలీలన్ = మిక్కిలి మనోజ్ఞమగువిలాసముతో, చొచ్చెదన్, బాలన్ = బాలికను (రుక్మిణిని), వ్రేల్మిడిన్ = శీఘ్రముగా, తెచ్చెదన్, పోరన్ = యుద్ధమునందు, రిపులు=శత్రువులు, అడ్డంబు, వచ్చినన్, వ్రచ్చెదన్=చీల్చెదను.

---

*"బరులమూఁకనడంచి" యనిపాఠాంతరము. అడంచి=ఓడించి.

తా. విదర్భదేశమునకు వచ్చి కుండినపురంబుం బ్రవేశించి శత్రువు లెంద అడ్డపడినను వారల యుద్ధములో నోడించి రుక్మిణిని దెత్తును.

వ. అని పలికి రుక్మిణీదేవిపెండ్లినక్షత్రంబు దెలిసి తనపంపున రథసారథి యైనదారుకుండు సైన్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబు లనుతురంగంబులం బూన్చి రథ మాయితంబు చేసి తెచ్చిన నమోఘమనోరథుం డైనహరి తానును బ్రాహ్మణుండును రథారోహణంబు చేసి యేకరాత్రంబున నానర్తకదేశంబులు గడచి విదర్భదేశమునకుం జనియె నందుఁ గుండినపురీశ్వరుం డైనభీష్మకుండు కొడుకునకు వశుం డై కూఁతు శిశుపాలున కిచ్చునట్లు తలంచి శోభనోద్యోగంబులు సేయించె నప్పుడు. 40

టీ. అని, పలికి = చెప్పి, రుక్మిణీదేవిపెండ్లినక్షత్రంబు = రుక్మిణీదేవి వివాహలగ్నమును, తెలిసి = ఎఱిఁగి, తనపంపునన్ = తనయాజ్ఞచేత, రథసారథి = రథమును గడుపువాఁడు, ఐనదారుకుఁడు = అయినట్టి దారుకుఁడనువాఁడు, సైన్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకంబులు (ఇవి నాలుగు కృష్ణుని గుఱ్ఱముల పేరులు.) అనుతురంగంబులన్ = అనుగుఱ్ఱములను, పూన్చి= కట్టి, రథము = తేరును, ఆయత్తంబు = సిద్ధము, చేసి, తెచ్చినన్, అమోఘమనోరథుండు = వ్యర్థముకాని కోరికకలవాఁడు, ఐనహరి= అయినకృష్ణుఁడు, తానును = కృష్ణుఁడును, బ్రాహ్మణుండును, రథఆరోహణంబు = రథమును నెక్కుటను, చేసి, ఏకరాత్రంబునన్=ఒకరాత్రిచేత, ఆనర్తకదేశంబులు = పశ్చిమసముద్రతీరమున ద్వారకకు దగ్గఱనున్న దేశవిశేషములను, కడచి = దాఁటి, విదర్భదేశమునకున్, చనియెన్, అందున్ = అచ్చట, కుండినపురిఈశ్వరుండు = కుండినపట్టణపురాజు, ఐన భీష్మకుఁడు, కొడుకునకున్, వశుండుఐ = లోఁబడినవాఁడై, కూఁతున్, శిశుపాలునకున్, ఇచ్చునట్లు, తలంచి, శోభనఉద్యోగంబులు = శుభప్రయత్నములు, చేయించెన్, అప్పుడు.

సీ. రచ్చలు క్రంతలు ♦ రాజమార్గంబులు
విపణిదేశంబులు ♦ విశదములుగఁ
జేసిరి చందన ♦ సిక్తతోయంబులు
గలయంగఁ జల్లిరి ♦ కలువడములు
రమణీయవివిధతో♦రణములు గట్టిరి
సకలగృహంబులుఁ ♦ జక్కఁజేసి
కర్పూరకుంకుమా♦గరుధూపములు వెట్టి
రతివలు పురుషులు ♦ నన్నియెడల
ఆ. వివిధవస్త్రములను ♦ వివిధమాల్యాభర
ణానులేపనముల ♦ నమరియుండి
రఖిలవాద్యములు మ♦హాప్రీతి మ్రోయించి
రుత్సవమున నగర ♦ మొప్పియుండె. 41

టీ. రచ్చలు=మండపములు, క్రంతలు= సందుత్రోవలు, రాజమార్గంబులు, విపణిదేశంబులు = అంగడివీథులు, విశదములుగన్ = స్పష్టములుగా (ప్రకాశములుగా), చేసిరి. చందనసిక్తతోయంబులు = గంధముచేఁ గలపఁబడిన ఉదకములు, కలయంగన్ = అంతట, చల్లిరి, కలువడములు = (ఉత్సవాదులయందు పెక్కెములు లోనగువానియందు కట్టెడిబంగారు) కలువపూదండలు, రమణీయ వివిధతోరణములున్ = మనోజ్ఞములయిన పలువిధములగుమామిడాకుతోరణములు, కట్టిరి. సకలగృహంబులు = అన్నియిండ్లను, చక్కఁజేసి, కర్పూరకుంకుమ అగరుధూపములు = కప్పురములయుం, కుంకుమపూవులయుం, అగరుచెక్కలయుం, ధూపములు, పెట్టిరి. అతివలు = స్త్రీలు, పురుషులను, అన్నియెడలన్, వివిధవస్త్రములను = పలువిధములగువస్త్రముల చేతను, వివిధమాల్య ఆభరణ అనులేపనములన్ = పలువిధము లగు పూలదండలచేతను, సొమ్ములచేతను, గంధపుఁబూఁతలచేతను, అమరి=ఒప్పి, ఉండిరి. అఖిలవాద్యములు = నానావిధములైనవాద్యములను, మహాత్ ప్రీతి = మిక్కిలి ప్రేమతో, మ్రోయించిరి. ఉత్సవమున్ = వేడుకచేత, నగరము=పట్టణము, ఒప్పియుండెన్.

తా. పట్టణమునందలి రాజమార్గములను, సందుగొందుల మండపాదులను చక్కఁజేసిరి. మంచిగంధమును నీటఁగలిపి యానీటిచే నూరథితయుఁ నలికించిరి. కర్పూరము కుంకుమపువ్వు అగరు మొదలగు పరిమళములచే ధూపము తెల్లచోట్ల వేయించిరి. పురుషులును స్త్రీలును మంచివస్త్రములను తొడవులను పుష్పములను ధరించియుండిరి. వివాహోత్సవమునకుఁగాను నానావిధములగువాద్యముల మ్రోయించుచుండిరి.

వ. అంత నాభీష్మకుండు విహితప్రకారంబులం బితృదేవతల
నర్చించి బ్రాహ్మణులకు భోజనంబులు పెట్టించి మంగళాశీ
ర్వచనంబులు చదివించి రుక్మిణీదేవి నభిషిక్తం జేసి వస్త్రయు
గళభూషితం గావించి రత్నభూషణంబు లిడంజేసి ఋగ్యజు
స్సామమంత్రంబులు మంగళాచారంబు లొనరించి భూసు
రులు రక్షాకరణంబు లాచరించిరి. పురోహితుండు గ్రహశాం
తికొఱకు నిగమనిగదితన్యాయంబున హోమంబుఁ గావించె
మఱియు నా రాజు దంపతుల మేలుకొఱకుఁ దిలధేనుకలధౌత
కనకచేలాదిదానంబులు ధరణీదేవతల కొసంగె నయ్యవస
రంబున. 42

టీ. అంతన్ = అటుపిమ్మట, ఆభీష్మకుండు, విహితప్రకారంబులన్ = శాస్త్రమునందుఁ జెప్పఁబడినరీతులుగా, పితృదేవతలన్ = నాందీశ్రాద్ధదేవతలను (వివాహమున నాందీశ్రాద్ధమని పితరులఁ బూజించుట యాచారము), అర్చించి = పూజించి, బ్రాహ్మణులకున్, భోజనంబులు, పెట్టించి, మంగళ ఆశీర్వచనంబులు = మేలునిచ్చుదీవనలు, చదివించి, రుక్మిణీదేవిన్, అభిషిక్తంజేసి = మంగళస్నానము కలదానిని చేసి, వస్త్రయుగళ భూషితన్ = రెండువస్త్రములచేత నలంకరింపఁబడినదానిని కావించి, రత్నభూషణంబులు ఇడంజేసి = నవరత్నములతోఁ జెక్కఁబడిన సొమ్ముల ధరించుకొన్నదానినిఁగాఁజేసి, ఋగ్యజుస్సామమంత్రంబులన్ = ఋగ్వేదము, యజుర్వేదము,

సామవేదము వీనియందలి మంత్రములచేతను, మంగళాచారంబులు = శుభప్రయోజనమునందుఁ జేయఁదగు నడవడులను, ఒనరించి=కావించి, భూసురులు = బ్రాహ్మణులు, రక్షాకరణంబులు = రక్షలనుచేయుటలు (గ్రహములు సోఁకకుండుటకై నొసట రక్షాధారణము వాడుక), ఆచరించిరి=చేసిరి. పురోహితుఁడు, గ్రహశాంతికొఱకున్ = నవగ్రహములశాంతికొఱకు, నిగమనిగదితన్యాయంబునన్ = వేదమునందుఁ జెప్పఁబడినరీతిని, హోమంబున్, కావించెన్, మఱియును, ఆరాజు = భీష్మకుఁడు, దంపతులమేలుకొఱకున్ = ఆలుమగలమంచికై, తిల ధేను కలధౌత కనకచేల ఆదిదానంబులు=నువ్వులు ఆవులు వెండి బంగారము వస్త్రములు మొదలగు దానములను, ధరణీదేవతలకున్=బ్రాహ్మణులకు, ఒసంగెన్=ఇచ్చెను. అయ్యవసరంబున = ఆసమయమునఁదు.

మ. భటసంఘంబులతో రథావళులతో • భద్రేభయూథంబుతోఁ
బటువేగాన్వితఘోటకవ్రజముతో • బంధుప్రియశ్రేణితోఁ
గటుసంరంభముతో విదర్భతనయం • గైకొందునంచున్ విశం
కటవృత్తిన్ జనుదెంచెఁ జైద్యుఁడు గడున్ • గర్వించి యప్వీటికిన్.

టీ. చైద్యుఁడు=శిశుపాలుఁడు, భటసంఘంబులతోన్=కాల్బలముల గుంపులతో, రథఆవళులతోన్=తేరులసమూహముతో, భద్రఇభయూథంబుతోన్=భద్రజాతియేనుంగుల సమూహముతో, పటువేగ అన్విత ఘోటకవ్రజముతోన్=ఎక్కువవేగముతోఁగూడిన గుఱ్ఱముల సమూహముతో, బంధుప్రియశ్రేణితోన్=బంధువులయొక్కయు, ఇష్టులయొక్కయుం సమూహముతో, కటుసంరంభముతోన్=మిక్కిలివేగముతో, విదర్భతనయన్=రుక్మిణిని, కైకొందున్=గ్రహింతును. అంచున్, విశంకటవృత్తిన్ = విరివియయిన వ్యాపారముతో, కడున్=మిక్కిలి, గర్వించి=క్రొవ్వి, అప్వీటికిన్=ఆకుండిన పురమునకు, చనుదెంచెన్=వచ్చెను.

తా. అప్పుడు శిశుపాలుఁడు చతురంగబలములతోను బంధువులతోను గూడి రుక్మిణిం బెండ్లియాడెద నని కుండిననగరమునకు వచ్చెను.

ఉ. బంధులఁ గూడి కృష్ణబల♦భద్రులు వచ్చినఁ బాఱఁదోలి ని
ర్బంధరవృత్తిఁ జైద్యునకు♦మానినిఁ గూర్చెద మంచు నుల్లస
త్సింధురవీరవాజిరథ♦సేనలతోఁ జనుదెంచి రాజరా
సంధుఁడుదంతవక్త్రుఁడును♦సాల్వవిదూరకపౌండ్రకాదులున్.

టీ. ఆజరాసంధుఁడు, దంతవక్త్రుఁడును, సాల్వ, విదూరక, పౌండ్రక ఆదులున్, వీరు, బంధులన్=చుట్టములను, కూడి, కృష్ణబలభద్రులు=కృష్ణుఁడును బలరాముఁడును, వచ్చినన్, పాఱఁదోలి = పరుగులిడునట్లు తఱిమి, నిర్బంధరవృత్తిన్=ఆలస్యములేనివ్యాపారముతో, చైద్యునికిన్=శిశుపాలునికి, మానినిన్=మానముగలదానిని (రుక్మిణిని), కూర్చెదము, అంచున్, ఉల్లసత్ సింధుర వీరవాజి రథసేనలతోన్=ప్రకాశించు యేనుఁగులతోను గుఱ్ఱములతోను బండ్లతోను సేనలతోను, చనుదెంచిరి=వచ్చిరి.

తా. జరాసంధుఁడు మొదలగువారు కృష్ణాదులను తఱిమి శిశుపాలునికి రుక్మిణిం గూర్చెద మని వచ్చిరి.

వ. మఱియు నానాదేశంబులరాజు లనేకు లేతెంచి రందు శిశు
పాలు నెదుర్కొని పూజించి భీష్మకుం డొకనివేశంబున
నతని విడియించె నంతఁ దద్వృత్తాంతంబు విని. 45

టీ. మఱియుం, నానాదేశంబులరాజులు = పెక్కు దేశంబులదొరలు, అనేకులు=పెక్కండ్రు, ఏతెంచిరి=వచ్చిరి, అందు, శిశుపాలున్, ఎదుర్కొని =ఎదురై, పూజించి, భీష్మకుండు, ఒకనివేశంబునన్ = ఒకయింటియందు, అతనిన్ = ఆశిశుపాలుని, విడియించెన్=దింపెను. అంతన్, తద్వృత్తాంతంబున్=ఆసమాచారమును, విని.

చ. హరియొకఁడేఁగినాఁడుమగ♦థాదులుచైద్యహితానుసారులై
నరపతు లెంద ఱేనిఁ జని♦నారు కుమారికఁ దెచ్చుచోట సం
గర మగుఁ దోడుగావలయుఁ♦గంసవిరోధికి నంచు వేగ తా
నరిగె హలాయుధుండు కమ♦లాక్షునిజాడ ననేకసేనతోన్.46

టీ. హాల ఆయుధుండు=నాఁగలియాయుధముగాఁగలవాఁడు (బలరాముఁడు), హరి=కృష్ణుఁడు, ఒకఁడు, ఏఁగినాఁడు=పోయినాఁడు, మగధ ఆదులు=జరాసంధుఁడు మొదలుగాఁగలవారు, నరపతులు=రాజులు, చైద్యహిత అనుసారులై=శిశుపాలుని హితమును అనుసరించినవారై, ఎందఱేనిన్ (అనేకులు అని యర్థము), చనినారు=పోయినారు. కుమారికన్=బాలికను (రుక్మిణిని), తెచ్చుచోటన్, సంగరమగు=యుద్ధము జరుగవచ్చును, కంసవిరోధికిన్=కంసుని శత్రువునకు (కృష్ణునికి), తోడుకావలయున్, అంచున్, వేగ=వడిగా, తాను (బలరాముఁడు), కమలఆక్షునిజాడన్ = కృష్ణునిదారిని, అనేకసేనతోన్=పెద్దదండుతో, అరిగెన్=పోయెను.

తా. కృష్ణునిపోకను విని బలరాముఁడు కృష్ణునికి సహాయముగా ననేక సేనలతో విదర్భకుం బోయెను.

క. ఆలోపల నేకతమున
నాలోలవిశాలనయన • యగురుక్మిణి త
న్నాలోకలోచనుఁడు హరి
యాలోకము సేసి కదియఁ • డని శంకితయై. 47

టీ. ఆలోపలన్ = ఆసమయమున, ఏకతమునన్ = ఒంటరిపాటున, ఆలోల విశాలనయన=అంతట చంచలములై వెడల్పులైన కన్నులుగలది, అగు రుక్మిణి, తన్నున్, ఆలోకలోచనుఁడు=జ్ఞానదృష్టిగలవాఁడు, హరి=కృష్ణుఁడు, ఆలోకము చేసి=చూచి (దయ చేసియని యర్థము), కదియఁడు=చేరఁడు, అని, శంకిత ఐ=సందేహముగలదై (వైపద్యముతో నన్వయము).

తా. ఆసమయమున రుక్మిణి కృష్ణుఁడు రాఁడని సందేహముగలదై. అలంకారము విరోధాభాసము.

శా. లగ్నం బెల్లి వివాహముం గదిసె నేఁలా రాఁడు గోవిం
దుఁ డు, ద్విగ్నం బయ్యెడి మానసంబు వినెనో • వృత్తాం
తముఁ బ్రాహ్మణుం, డగ్నిద్యోతనుఁ డేటికిం దడసెనో •

యత్నంబు సిద్ధించునో, భగ్నం బై చనునో విరించికృత
మెట్లంగిం బ్రవర్తించునో. 48

టీ. లగ్నంబు = రాశ్యుదయము (ముహూర్తము), ఎల్లి=ఱేపు, వివాహానుక్, కదిసెక్ = సమీపించెను, గోవిందుఁడు = కృష్ణుఁడు, ఏలా, రాఁడు, మానసంబు = మనస్సు, ఉద్విగ్నంబు = భయముకలది, అయ్యెడిక్ = అవుచున్నది, వృత్తాంతముక్ = సమాచారమును, వినెను, ఓ, అగ్నిద్యోతనుఁడు = అగ్నిద్యోతనుఁడను పేరుగల బ్రాహ్మణుండు, ఏటికిక్ = ఎందుకు, తడసెక్ ఓ=ఆలస్యముచేసెనో, యత్నంబు=(నా) ప్రయత్నము, సిద్ధించుక్ ఓ=నెఱవేఱునో, భగ్నంబు ఐ = భంగమునొందినదై, చనుక్ ఓ = పోవునో, విరించికృతము = బ్రహ్మచేఁ జేయఁబడినది (బ్రహ్మతలంపు), ఎట్లంగిక్ = ఏరీతిని, ప్రవర్తించుక్ ఓ=జరుగునో.

తా. ఱేపు వివాహాలగ్నము. ఇంకను కృష్ణుఁడు రాఁడయ్యెను. ఆబ్రాహ్మణుండు అచ్చటికిఁబోయెనో? దైవకృత మెట్లున్నదో ?

మ. ఘనుఁ డాభూసురుఁ డేఁగెనో నడుమ మార్గశ్రాంతుఁ డై
చిక్కెనో, విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో విచ్చే
యునో యీశ్వరుం, డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో
యార్యామహాదేవియుక్, నను రక్షింప నెఱుంగునో యె
ఱుఁగదో నాభాగ్య మెట్లున్నదో. 49

టీ. ఘనుఁడు=మహాత్ముఁడు, ఆభూసురుఁడు=ఆబ్రాహ్మణుఁడు, ఏఁగెక్ ఓ=పోయెనో, మార్గశ్రాంతుఁడుఐ = దారిలో బడలినవాఁడై, నడుమక్, చిక్కెక్ ఓ = తగులుకొనెనో, ఇది = ఈసమాచారమును, విని, కృష్ణుండు, తప్పుగాక్, తలఁచెక్ ఓ, విచ్చేయుక్ ఓ=వచ్చునో, ఈశ్వరుండు=శివుఁడు, అనుకూలింపక్ = అనుకూలపఱచుటకు, తలంచుక్ ఓ, తలఁపఁడుఓ, ఆర్యామహాదేవియుక్=గౌరీదేవియును, నన్ను, రక్షింపక్, ఎఱుంగుక్ ఓ, ఎఱుఁగదుఓ, నాభాగ్యము=నాఅదృష్టము, ఎట్లు ఉన్నదిఓ.

తా. ఆబ్రాహ్మణుఁడు పోయెనో లేక దారిలో బడలి మార్గమధ్యము ననే యున్నాఁడో, లేక అతఁడు పోయి చెప్పియుండిన కృష్ణుఁ డీసమాచారమును తప్పుగా భావించెనో, ఇంతటికిని ఈశ్వరాజ్ఞ యెట్లున్నదో, గౌరీదేవి నన్నుఁ గాపాడ నెంచి యున్నదో లేదో, నాయదృష్టమును చూడవలసి యున్నది.

వ. అని వితర్కించుచు. 50

టీ. అని=ఈప్రకారము, వితర్కించుచున్=ఆలోచించుచు.

ఉ. పోఁడను బ్రాహ్మణుండు యదు•పుంగవు వీటికి వాసుదే
వుఁడున్, రాఁడను నింకఁ బోయి హరి • రమ్మని చీరెడి
యిష్టబంధుఁడున్, లేఁడను రుక్మి కిం దగవు • లే దిట చై
ద్యున కిత్తు నంచు నున్నాఁ డను గౌరి కీశ్వరికి • నావల
నం గృప లేదు నేఁ డనున్. 51

టీ. బ్రాహ్మణుండు, యదుపుంగవువీటికిన్=యాదవశ్రేష్ఠుని పట్టణమునకు (ద్వారకకు), పోఁడు, అనున్, వాసుదేవుఁడున్=కృష్ణుఁడును, రాఁడు, అనున్, ఇంకన్, పోయి, హరిన్, రమ్ము, అని, చీరెడియిష్టబంధుఁడున్ = పిలుచుప్రియబంధుగు, లేఁడు, అనున్, రుక్మికిన్, తగవు=పాడి-న్యాయము, లేదు, ఇటన్=ఇక్కడ, చైద్యునకున్ = శిశుపాలునికి, ఇత్తున్, అంచున్, ఉన్నాఁడు, అనున్, ఈశ్వరికిన్ = ఈశ్వరుని భార్య యగు, గౌరికి = పార్వతికి, నావలనన్ = నావిషయమున (నాయందు), నేఁడు, కృప=దయ, లేదు, అనున్.

తా. బ్రాహ్మణుఁడు పోయియే యుండఁడనియు, కృష్ణుఁడే రాక యుండుననియు, మరలపోయి కృష్ణుని పిలుచుకొని రాను ఇష్టుఁడైనబంధువుఁ డొక్కఁడును లేఁడేయనియు, నన్ను శిశుపాలునికే యిచ్చెదనని రుక్మి తలఁచుటలో న్యాయములేదనియు, నాయందు గౌరికి కృపలేకపోయెనే యని యు వేదన పడుచుండెను.

ఉ. చెప్పదు తల్లికిం దలఁపుఁ◆జిక్కు దిశల్ దరహాసచంద్రికం
గప్పదు వక్త్రతామరస◆గంధసమాగతభృంగసంఘమున్
రొప్పదు నిద్రఁ గైకొన దు◆రోజపరస్పరసక్తహారముల్
విప్పదు కృష్ణమార్గగత◆వీక్షణపంక్తులఁ ద్రిప్ప దెప్పుడున్.

టీ. తలఁపుచిక్కు = మనసులోని విచారమును, తల్లికిన్, చెప్పదు. దరహాసచంద్రికన్ = చిఱునగవు వెన్నెలచేత, దిశల్=దిక్కులను, కప్పదు. వక్త్రతామరస = మోముతమ్మియొక్క, గంధ=వాసనకు, సమాగత=వచ్చిన, భృంగ = తుమ్మెదలయొక్క, సంఘమున్ = సమూహమును, రొప్పదు=తఱుమదు. నిద్రన్, కైకొనదు = పొందదు. ఉరోజపరస్పర సక్తహారముల్ - ఉరోజ=చనులమధ్య, 'పరస్పర = ఒకటొకటి, సక్త = చిక్కుపడిన, హారముల్ = ముత్యాలహారములను, విప్పదు=విడఁదీయదు. కృష్ణమార్గగతవీక్షణపంక్తులు = కృష్ణునిదారినిబొందిన జూపుల వరుసలు, ఎప్పుడున్, త్రిప్పదు= మరలింపదు.

తా. మనసులోనిచింతను తల్లికిఁ జెప్పదు. చిరునవ్వునవ్వదు. ముఖమునకు మూగినతుమ్మెదలను దఱుమదు. నిద్రపోదు. చిక్కుపడినముత్యాలహారములను విడఁదీయదు. ఎల్లప్పుడు కృష్ణునిదారినే చూచును.

చ. తుడువదు కన్నులన్ వెడలు◆తోయకణంబులు కొప్పుఁ జ
క్కఁగాఁ, ముడువదు నెచ్చెలిం గదిసి◆ముచ్చటకుం జన దన్న
మేమియుం, గుడువదు నీరముం గొనదు ◆ కూరిమిఁ గీరముఁ
జేరి పద్యమున్, నొడువదు వల్లకీగుణవి◆నోదము సేయదు
డాయ దన్యులన్. 53

టీ. కన్నులన్=కన్నులనుండి, వెడలుతోయకణంబులున్ = కాఱునీటి బిందువులను, తుడువదు. కొప్పున్, చక్కఁగాన్, ముడువదు=ముడివేయదు. నెచ్చెలిన్ =ప్రియసఖిని, కదిసి=చేరి, ముచ్చటకున్, చనదు=పోదు. అన్నము, ఏమియున్, కుడువదు = తినదు. నీరమున్=నీటిని, కొనదు=త్రాగదు. కూరిమిన్=ప్రేమతో, కీరమున్ = (పెంపుడు) చిలుకను, చేరి, పద్యమున్=శ్లోక

మును, నుడువదు = చెప్పదు. వల్లకీగుణవినోదము = వీణాతంత్రుల (మీటు నట్టి) క్రీడను, చేయదు. అన్యులన్ = ఇతరులను, డాయదు = చేరదు.

తా. కన్నీటిధారలం దుడువదు. కొప్పును చక్కఁగా ముడివేయదు. ప్రియసఖితో ముచ్చటలాడదు. అన్నముం దినదు. నీరు ద్రావదు. చిలుకకుఁ బద్యమును చెప్పదు. వీణను. వాయించదు. ఇతరులయొద్దకుఁ బోవక యొంటరిగా నుండును.

సీ. మృగనాభి యలఁదదు ♦ మృగరాజమధ్యమ
జలకంబు లాడదు ♦ జలజగంధి
ముకురంబు సూడదు ♦ ముకురసన్నిభముఖి
పువ్వులు దుఱుమదు ♦ పువ్వుఁబోఁడి
వనకేళిఁ గోరదు ♦ వనజాతలోచన
హంసంబుఁ బెంపదు ♦ హంసగమన
లతలఁ బోషింపదు ♦ లతికాలలితదేహ
తొడవులు తొడువదు ♦ తొడవుతొడవు

ఆ. తిలక మిడదు నుదుటఁ ♦ దిలకినీతిలకంబు
కమలగృహముఁ జొరదు ♦ కమలహస్త
గారవించి తన్నుఁ ♦ గరుణఁ గైకొన వన
మాలి రాఁడు తగవు ♦ మాలి యనుచు. 54

టీ. వనమాలి = కృష్ణుఁడు, తన్నున్, గారవించి = గౌరవించి (లక్ష్యముచేసి), కరుణన్ = దయతోడ, కైకొనన్ = గ్రహించుటకు, తగవు = న్యాయము, మాలి = విడిచి, రాఁడు, అనుచున్, మృగరాజ మధ్యమ = సింహముయొక్క నడుమువంటి నడుముగలది (రుక్మిణి), మృగనాభి = కస్తూరిని, అలఁదదు = పూయదు. జలజగంధి = కమలముల యొక్క వాసనవంటి వాసనగలది (రుక్మిణి), జలములనాడదు = స్నానము చేయదు. ముకురసన్నిభముఖి = అద్దమునకు సమానమైన మోముగల (రుక్మిణి), ముకురంబున్ = అద్దమును, చూడదు, పువ్వుఁబోఁడి = పువ్వులవంటి

శరీరముగలది (సుకుమారమైనశరీరముగలది), పువ్వులు, తుఱుమదు = ముడువదు. వనజాతలోచన = కమలములవంటి కనులుగలది (రుక్మిణి), వనకేళిన్ = వనవిహారము, కోరదు. హంసగమన = హంసలయొక్క నడకవంటి నడకగలది, హంసంబున్, పెంపదు. లతికాలలితదేహ = తీఁగెవలెమనోజ్ఞమగు శరీరముగలది (రుక్మిణి), లతలన్ = తీవలను, పోషింపదు = పెంపదు. తొడవు తొడవు = అలంకారమునకు నలంకారము (మిక్కిలి అందమైనది), తొడవు = సొమ్ములను, తొడవదు = ధరింపదు. తిలకినీతిలకంబు = ముత్తైదువులలో నుత్తమురాలు—ఎల్లప్పుడు ముత్తైదువుగా నుండినది (రుక్మిణి), నుదుటన్ = నొసటియందు, తిలకము = బొట్టు, ఇడదు = ఉంచదు (పెట్టదు) కమలహస్త = కమలములవంటి చేతులుగలదియగు (రుక్మిణి), కమలగృహమున్ = కమలాకరమును (కొలనును), చొరదు = (జలక్రీడార్థము) ప్రవేశింపదు.

తా. కృష్ణుఁడు రానందున రుక్మిణి విసుకుచేఁ గస్తూరి మొదలైన వానిని ధరింపలేదు.

మృగరాజమధ్యమ మొదలగురుక్మిణీ విశేషణములు మృగనాభియలందుట యనావశ్యకము అనుటను తెలుపును. ఇట్లు జలజగంధి మొదలైనవి ఆయా కార్యములు లేకపోయినను తక్కువ కాకుండుటను దెల్పుచున్నవి.

వ. మఱియును. 55

మ. మలఁగున్ మెల్లనిగాలికిన్ బటునటన్మత్తద్విరేఫాళికిన్
దలఁగుం గోయిలమ్రోఁతకై యలఁగును ద్యత్కారసంభాషలం
గలఁగున్ వెన్నెలవేఁడికిన్నలఁగుమాకందాంకురచ్ఛాయకుం
దొలఁగుం గొమ్మమనోభవానలశిఖాదోధూయమానాంగియై.

టీ. కొమ్మ = స్త్రీ (రుక్మిణి), మనోభవ = మన్మథుఁడను, అనల = అగ్నియొక్క, శిఖా = మంటలచేత, దోధూయమాన = మిక్కిలితపింపఁజేయఁబడుచున్న, అంగియై = శరీరముగలదియై, మెల్లనిగాలికిన్ = మందమారుతమునకు, మలఁగున్ = తిరుగును (మాఱుమోముకలదైపోవును.). పటునటత్ మత్తద్విరేఫ ఆళికిన్ = బాగుగానృత్యముచేయుచు మంచితుమ్మెదలవరుసకు, తలఁగున్ =

తొలఁగును. కోయిలప్రోఁతకున్ ఐ=కోవెలలరొదకై, అలఁగున్=కోపించును. ఉద్యత్కీరసంభాషలన్ = ఉదయించుచున్న చిలుకపలుకులచేత, కలఁగున్ =కలఁతపడును. వెన్నెలవేఁడికిన్ = వెన్నెలకాఁకకు, నలఁగున్ =నలిగిపోవును. మాకంద అంకురచ్ఛాయకున్ = తీయమామిడి మొలకలనీడకు, తొలఁగున్ = ఒదుగును.

తా. రుక్మిణి విరహవేదన కోర్వఁజాలక మందమారుతమునకుఁ బోవక యింటికిఁ దిరుగును. తుమ్మెదలరొదకు తొలఁగును. కోయిలప్రోఁతకు దుఃఖపడును. చిలుకపలుకులకు శ్రమపడును. వెన్నెలవేఁడికి నలిగిపోవును. తీయమామిడిచెట్టునీడకుఁ బోకుండును. ఇవి విరహకాలమునందు బాధించునవియని భావము.

వ. ఇట్లు హరిరాక కెదురుసూచుచు సకలప్రయోజనంబులందును విరక్తయై మనోజానలంబునం బొగిలెడిమగువకు శుభంబు చెప్పుచందంబున వామలోచనభుజంబు లదిరె నంతఁ గృష్ణునియోగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన నతనిముఖలక్షణం బుపలక్షించి యాకలకంఠకంఠి మహోత్కంఠతోడ నకుంఠితయై మొగంబునం జిఱునగవు నిగుడ నెదురు సని నిలువంబడిన బ్రాహ్మణుం డిట్లనియె. 57

టీ. ఇట్లు=ఈప్రకారము, హరిరాకకున్=కృష్ణుని వచ్చుటకు, ఎదురుచూచుచున్, సకలప్రయోజనంబులందును = అన్నికార్యములయందును, విరక్తయై=విసుగుకలదై, మనోజాతానలంబునన్ = మన్మథాగ్నిచేత, పొగిలెడి మగువకు=పరితపించు స్త్రీకి (రుక్మిణికి), శుభంబున్ = మేలును, చెప్పుచందంబునన్ = తెల్పునట్లు, వామఊరులోచనభుజాంబులు = ఎడమతొడ కన్ను భుజములు (వామోరులోచనభుజంబు అని యేకవచనాంతముగా నుండవలయును), అదరెన్=కదలెను. (స్త్రీలకు నెడమభాగము లదరుట శుభసూచకము అని సాముద్రికము.) అంతన్, కృష్ణునియోగంబునన్ = కృష్ణుని యాజ్ఞచేత, బ్రాహ్మణుండు, చనుదెంచినన్ = రాఁగా, అతనిముఖలక్షణం

బు=అతనిముఖచిహ్నమును, ఉపలక్షించి = చూచి, ఆకలకంఠకంఠి = అయ వ్యక్త మధురమగు (ధ్వనిగల) కంఠముకలది (రుక్మిణి), మహత్ ఉత్కంఠ తోడన్=గొప్పతహతహతో, అకుంఠితయై=జాగ్రత్తకలదై, మొగంబునన్, చిఱునగవు=చిన్ననవ్వు, నిగుడన్=కలుగఁగా, ఎదురుచని, నిలుపంబడినన్= నిలుచుండఁగా, బ్రాహ్మణుండు, ఇట్లు, అనియెన్.

ఉ. మెచ్చె భవద్గుణోన్నతి క•మేయధనావళు లిచ్చె నాకుఁ దా
వచ్చె సుదర్శనాయుధుఁడు • వాఁడె సురాసురులెల్ల నడ్డమై
వచ్చిన నైన రాక్షసవి•వాహమునన్ గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును•సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా.

టీ. కన్యకా=పడుచా! (రుక్మిణీసంబోధనము) భవత్ గుణఉన్నతికిన్=నీగుణములయతిశయమునకు, మెచ్చెన్ = మెచ్చుకొనెను. నాకున్, అమేయధనఆవళులు = ఎన్నరానిధనసమూహములను. ఇచ్చెన్, సుదర్శన ఆయుధుఁడు=చక్రాయుధుఁడు (కృష్ణుఁడు), తాన్, వచ్చెన్, వాఁడుఎ= అతఁడో [ఇది అతిసామీప్యమును దెల్పును], సుర అసురులు = దేవతలును రాక్షసులును, ఎల్లన్=అందఱును, అడ్డముఐవచ్చిననైనన్ = అడ్డముగావచ్చినప్పటికిని, రాక్షసవివాహమునన్ = వధువుతలిదండ్రుల యనుమతిలేకయే కన్యను బలవంతముగాఁ గొనిపోయిచేసికొను పెండ్లిప్రకారముగా, నినున్, కొనిపోవును నీసచ్చరితంబున్ = నీమంచినడతయును, భాగ్యమును=అదృష్టమును, సర్వమున్=అంతయును, నేఁడు, ఫలించెన్=పండెను.

తా. నీగుణాతిశయంబులకు మెచ్చి యాకృష్ణుఁడు వచ్చియున్నవాఁడు, నిన్నుఁగొనిపోవును నీకోరిక ఫలించెను.

వ. అనిన వైదర్భి యిట్లనియె. 59

టీ. వైదర్భి=విదర్భరాకుమారుఁతురు (రుక్మిణి).

మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా•సందేశముం జెప్పినన్
నిలువం బెట్టితి నీకృపన్ బ్రతికితిన్ • నీయట్టిపుణ్యాత్మకుల్

కలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం • గావింపఁగా నేర నం
జలిఁ గావించెద భూసురాన్వయమణీ • సద్బంధుచింతామణీ.

టీ. భూసుర అన్వయమణీ=బ్రాహ్మణవంశమునకు రత్నమా! (బ్రాహ్మణునిసంబోధనము) సత్ బంధుచింతామణీ = సత్పురుషులకును బంధువులకును తలంపుల నిచ్చునట్టి రత్నమా! (బ్రాహ్మణుని సంబోధనము) జలజాతఈక్షణున్=కమలములవంటి కన్నులుగలవానిని(కృష్ణుని), నాసందేశమునన్=నాసమాచారమును, చెప్పి, తోడితెచ్చితివి=పిలిచికొనివచ్చితివి, నన్ నిలుపన్ బెట్టితి=నన్ను బ్రతికించితివి, నీకృపన్ = నీదయచేత, బ్రతికితిన్, నీయట్టి పుణ్య ఆత్మకుల్ = నీవంటిపుణ్యస్వభావముగలవారు, కలరే=ఉన్నారా, (లేరనిభావము.) దీనికిన్=ఈయుపకారమునకు, నీకున్, ప్రత్యుపకృతిన్=బదులుపకారమును, కావింపఁగాన్=చేయుటకు, నేరన్, అంజలిన్=చేమోడ్పును, కావించెదను.

తా. బ్రాహ్మణోత్తముఁడా! నాసమాచారములం జెప్పి కృష్ణునిం బిలిచికొనివచ్చి నన్ను బ్రతికించిన పుణ్యాత్మునికి నీకుఁ బ్రత్యుపకారమేమియుం జేయఁజాలను. నమస్కరించెదను. (సర్వలోకములచే నమస్కరింపఁబడు సాక్షాల్లక్ష్మియే నమస్కరించినపుడు అతని కేమియుఁ గొఱఁత యుండదు.)

వ. అని నమస్కరించె నంత రామకృష్ణులు దనకూఁతువివాహంబునకు వచ్చుట విని తూర్యఘోషంబులతో నెదురొక్కని విధ్యుక్తప్రకారంబునం బూజించి మధుపర్కంబు లిచ్చి వివిధాంబరాభరణంబులు మొదలైన కానుక లొసంగి భీష్మకుండు బంధుజనసేనాసమేతు లైనవారలకుఁ దూర్ణంబ సకలసంపత్పరిపూర్ణంబు లైన నివేశంబులు కల్పించి విడియించె నిట్లు కూడినరాజుల కెల్లను వయోవీర్యవిత్తంబు లెట్లట్ల కోరినపదార్థంబు లెల్ల నిప్పించి

పూజించె నంత విదర్భపురంబు ప్రజలు హరిరాక విని వచ్చి
చూచి నేత్రాంజలులం దదీయవదనకమలమధుపానంబు
సేయుచు. 61

టీ. అని = ఈప్రకారముచెప్పి, నమస్కరించెన్ = మ్రొక్కెను, అంతన్, రామకృష్ణులు, తనకూఁతువివాహంబునకున్, వచ్చుటన్, విని, తూర్యఘోషంబులతోన్ = వాద్యధ్వనులతో, ఎదుర్కొని, విధ్యుక్తప్రకారంబునన్ = శాస్త్రమునందుఁ జెప్పఁబడినరీతిని, పూజించి, మధుపర్కంబులు = పెరుఁగుతోఁడి తేనెలు (వివాహకాలమునవరునకిచ్చెడు నాహారము), ఇచ్చి, వివిధఅంబర ఆభరణంబులు = పలువిధములగు వస్త్రములు సొమ్ములును, మొదలైన, కానుకలు = కట్నములను, ఒసంగి = ఇచ్చి, భీష్మకుండు, బంధుజనసేనాసమేతులు = బంధువులతోను సేనలతోను గూడినవారు, అయినవారలకు, తూర్ణంబ = త్వరఁగా, సకలసంపత్పరిపూర్ణంబులు = ఎల్లసిరులతో నిండినవి, అయిననివేశంబులు = అయిన యిండ్లు, కల్పించి = ఏర్పఱచి, విడియించెన్ = దింపెను. ఇట్లు, కూడినరాజులన్, ఎల్లను, వయోవీర్య బలవిత్తంబులు = వయస్సు పరాక్రమము సేనలు ధనములు, ఎట్లు = ఏప్రకారమో, అట్లు = ఆప్రకారమే (వారివారికిఁ దగినట్లు), కోరినపదార్థంబులు = వలసినవస్తువులు, ఎల్లన్, ఇప్పించి, పూజించెన్, అంత, విదర్భపురంబుప్రజలు = కుండిననగరములోనిజనులు, హరిరాకన్ = కృష్ణునివచ్చుట, విని, వచ్చి, చూచి, నేత్రఅంజలులన్ = కనులనెడి దోసిళ్లచేత, తదీయవదనకమల మధుపానంబున్ = ఆతనిదగు ముఖమనెడు కమలమునందలి తేనెయొక్క త్రాగుటను, చేయుచు, (కన్నులతోఁ గృష్ణుని చూచుచు అనిభావము.) అలంకారము రూపకము.

మ. తగు నీచక్రి విదర్భరాజసుతకున్ • దక్షంబు వైదర్భియుం
దగు నీచక్రికి నింత మంచిదగునే • దాంపత్య మీయిద్దఱం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా • దర్పాహతారాతియై
మగఁడౌఁగావుతఁ జక్రి యీరమణికిన్ • మాపుణ్యమూలంబునన్

టీ. ఈచక్రి = కృష్ణుఁడు, విదర్భరాజసుతకున్ = రుక్మిణికి, తగున్, తథ్యంబు = సత్యము, వైదర్భియుఁన్ = రుక్మిణియు, ఈచక్రికిన్ = ఈకృష్ణునికి, తగున్. దాంపత్యము=దంపతులభావము, ఇంతమంచిదిఆగునువి (ఇంత మంచి దాంపత్యము ఎక్కడను కుదరదని భావము.), ఈయిద్దఱున్, తగులన్ = కలసియున్నట్లు, కట్టిన బ్రహ్మ=కూర్చినదైవము, నేర్పరి = సమర్థుఁడు, కదా (అవునసుట), చక్రి,దర్పఅహతఅరాతిఐ=గర్వము చేఁ గొట్టఁబడినశత్రువులుగలవాఁడై, ఈరమణికిన్ = ఈయింతికి (రుక్మిణికి), మాపుణ్యమూలంబునన్ = మేము చేసినపుణ్యముచేతనైనను, మగఁడు, ఔఁగావుతన్ = కావలసినది.

తా. విదర్భజనులు కృష్ణుని రుక్మిణినిఁ జూచి వీరికిద్దఱికి వివాహము అగునట్లు దైవముం బ్రార్థించిరి. అలంకారము-సమము.

వ. అని యిట్లు పలికి రాసమయంబున. 63

టీ. అని, ఇట్లు, పలికిరి = (జనులు) చెప్పిరి, ఆసమయంబునన్ = ఆ కాలమున.

సీ. సన్నద్ధులై బహుశస్త్రసమేతులై
బలసి చుట్టును వీర•భటులు గొలువ
ముందట నుపహార•ములు గానుకలు గొంచు
వర్గంబులై వార•వనిత లేఁగఁ
బుష్పగంధాంబర•భూషణకలితలై
పాడుచు భూసుర•భార్య లరుగఁ
బణవమర్దళశంఖ•పటహకాహళవేణు
భేరీధ్వనుల మిన్ను • పిక్కటిలఁగఁ
ఆ. దగిలి సఖులు గొలువఁ • దల్లులు బాంధవ
సతులుఁ దోడ రాఁగ • *సవినయమున

* 'సనియమమున' అనిపాఠాంతరము. ఉచితముగఁ దోఁచుచున్నది.

నగరు వెడలి నడచె • నగజాతకును మ్రొక్క
బాల చికురపిహిత•ఫాలయగుచు. 64

టీ. వీరభటులు = శూరులగుబంటులు, సన్నద్ధులు ఐ = కవచములు దొడిగినవారై, బహుశస్త్రసమేతులై = అనేకములగు ఆయుధములతోఁ గూడినవారై, చుట్టును, బలసి = పరివేష్టించి, కొలువన్, వారవనితలు = వెలయాండ్రు, వేశ్యలు, ముందటన్, ఉపహారములు = నజరులు, కానుకలు = బలులు (పూజాద్రవ్యములు), కొంచున్, వర్గంబులై = గుంపులై, ఏఁగన్ = బోఁగా, భూసురభార్యలు = బాఁపనముత్తైదువులు, పుష్పగంధ అంబరభూషణకలితలు ఐ = పువ్వులతోను గంధపుష్ప వస్త్రములతోను సొమ్ములతోను గూడినవారై, పాడుచున్ = (పాటలు) పాడుచు, చరుగన్ = పోఁగా, పణవ = మద్దుకుల్లలయును, మర్దళ = మద్దెళలయును, శంఖ = శంఖములయును, పటహ = తప్పెటలయును, కాహళ = తూరలయును, వేణు = పిల్లనగ్రోవులయును, భేరి = నగారాలయును, ధ్వనుల = శబ్దములచేత, పిక్కటిలఁగన్ = పగులఁగా, తగిలి = వెంబడించి, సఖులు = చెలికత్తెలు, కొలువన్ = సేవింపఁగా, తల్లులు, బాంధవసతులు = బంధుస్త్రీలు, తోడరాఁగన్ = వెంటరాఁగా, సవినయమునన్ = అడఁకువతో, నగరు వెడలి, బాల = రుక్మిణి, చికురపిహితఫాల = ముంగురులచేఁ గప్పఁబడిననుదురుగలది, అగుచున్, నగజాతకును = కొండపుట్టువునకు (గౌరికి), మ్రొక్కన్, నడచెన్.

తా. రుక్మిణి భటు లిరుప్రక్కల రాఁగా ముందఱ పూజాద్రవ్యముల నెత్తుకొని వేశ్యలు పోవుచుండఁగా దల్లులు సఖులు వెంటరాఁగా గౌరికి మ్రొక్కుటకై అంతఃపురమునుండి బయలువెడలెను.

వ. మఱియు సూతమాగధవందిగాయకపాఠకజను లంతంత నభినందించుచుం జనుదేర మందగమనంబున ముకుందచరణారవిందంబులు డెందంబునఁ దలంచుచు నిందుధరసుందరీమందిరంబు చేరి సలిలధౌతకరచరణారవిందయై వార్చి శుచియై

గౌరీసమీపంబునకుం జనియె నంత ముత్తైదువ లగుభూసు
రోత్తములభార్యలు భవసహిత యైనభవానికి మజ్జనంబు
కావించి గంధాక్షతంబులిడి వస్త్రమాల్యభూషణాదుల నలం
కరించి ధూపదీపంబు లొసంగి నానావిధోపహారంబులు సమ
ర్పించి కానుక లిచ్చి దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని
మ్రొక్కించి రప్పుడు. 65

టీ. మఱియు, సూత=బట్టువాండ్లు, మాగధ=వంశావళిని జదువువారు, వంది=పరాక్రమమును బొగడువారు, గాయక=గాయకము చేయువారు, పాఠకజనులు=ప్రబంధములఁ జదువువారు, అంతంతన్=అచ్చటచ్చట, అభినందించుచున్=కొనియాడుచు, చనుదేరన్=రాఁగా, మందగమనంబునన్=చిన్ననినడకతో, ముకుందచరణ అరవిందంబులు=కృష్ణుని పాదకమలములను, డెందంబునన్=మనసునందు, తలంచుచున్, ఇందుధరసుందరీమందిరంబు=చంద్రశేఖరునిభార్య (గౌరి) యొక్కగుడి, చేరి, సలిల=నీటిచేత, ధౌత=కడుఁగఁబడిన, కరచరణఅరవిందయై=కమలములవంటి చేతులును పాదములును కలదియై, వార్చి=ఆచమనముచేసి, శుచియై=పరిశుద్ధయై, గౌరిసమీపంబునకున్=గౌరిదగ్గఱకు, చనియెన్. అంత, ముత్తైదువలగు, భూసుర ఉత్తములభార్యలు=బ్రాహ్మణశ్రేష్ఠులభార్యలు, భవసహిత=శివునితోఁ గూడినది ('భవసహిత' యని భవుని కుపసర్జనత్వము చెప్పుట. స్త్రీలు స్త్రీలను పూజించుదు రనుటను దెల్పును), ఐనభవానికిన్=అయినట్టిగౌరికి (పార్వతీపరమేశ్వరులకనుట), మజ్జనంబు=అభిషేకమును, కావించి, గంధఅక్షతంబులు, ఇడి, వస్త్రమాల్యభూషణాదులన్=వస్త్రములు పూదండలు సొమ్ములు మొదలగువానిచే అలంకరించి, ధూపదీపంబులు, ఒసంగి, నానావిధ ఉపహారంబులు=పలుతెఱంగు లగునజరులు, సమర్పించి=ఇచ్చి, కానుకలు=పూజాద్రవ్యములను, ఇచ్చి, దీపమాలికలన్=దీపములవరుసలచేత, (ముందుచెప్పినదీపములు నైవేద్యమునకుముందు జరిగినవి యని పిమ్మటఁజేయఁ

బడునవి యనియు భేదమెఱుంగునది), నివాళించి = ఆరతెత్తి, రుక్మిణీదేవిని, మ్రొక్కించిరి, అప్పుడు.

ఉ. నమ్మితి నామనంబున సనాతను లైనయుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల • మేలు భజింతుఁగదమ్మ మేటిపె
ద్దమ్మ దయాంబురాశివిగ•దమ్మ హరిం బతిఁ జేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నఁటికి • నాశము లేదు గదమ్మ యీశ్వరీ!

టీ. సనాతనులు=ఎప్పటికినుండువారు, పురాణదంపతులన్=నిత్యులగు నాలుమగలను, ఉమామహేశులన్=పార్వతీపరమేశ్వరులను, మిమ్మున్, నామనంబునన్=నామనమునందు, నమ్మితిన్, ఈశ్వరీ=ఓగౌరీ, మేలు, భజింతున్=పొందుదును. దయా అంబురాశివి=దయకు సముద్రమవుకదమ్మ, హరిన్=కృష్ణుని, పతిన్=మగనిని, చేయుము, అమ్మ, నిన్=నిన్ను, నమ్మినవారికిన్, ఎన్నటికిన్, నాశము=కీడు, లేదు, కదమ్మ.

తా. గౌరీ! ఎడతెగని దంపతిభావముగల మిమ్ము నాశ్రయించు నాకు కృష్ణుని మగనిగాఁజేసి నాకోరిక నీడేర్పుము.

వ. అని గౌరిదేవికి మ్రొక్కి పతులతోడం గూడినబ్రాహ్మణ
భార్యలకు లవణాపూపంబులను దాంబూలకంఠసూత్రం
బులును ఫలంబులు నిక్షుదండంబు నిచ్చి రుక్మిణీదేవి వారలం
బూజించిన. 67

టీ. అని, గౌరీదేవికి=పార్వతికి, మ్రొక్కి=నమస్కరించి, పతులతోడన్=మగలతో, కూడినబ్రాహ్మణభార్యలకున్=కలసినబ్రాహ్మణస్త్రీలకు (దంపతులకు), లవణ అపూపంబులును=ఉప్పును, పిండివంటలును, తాంబూల కంఠసూత్రంబులును = తాంబూలంబులును మంగళసూత్రంబులును, ఫలంబులు= పండ్లును, ఇక్షుదండంబును=చెఱకుగడలును, ఇచ్చి, రుక్మిణీదేవి, వారలన్= ఆదంపతులను, పూజించినన్.

ఆ. వార లుత్సహించి • వల నొప్ప దీవించి
సేస లిడరి యువతి•శిరమునందు

సేస లెల్లఁ దాల్చి • శివవల్లభకు మ్రొక్కి
మౌననియతి మాని • మగువ వెడలె. 68

**టీ.** వారలు=ఆదంపతులు, ఉత్సహించి=సంతసించి, వలను ఒప్పన్=చేర్పు కలుగునట్లు, దీవించి=ఆశీర్వదించి, సేసలు = అక్షతలను, యువతిశిరమునందున్=జవరాలి శిరస్సునందు, ఇడిరి=ఉంచిరి. సేసలు, ఎల్లన్, తాల్చి=ధరించి, మగువ=స్త్రీ (రుక్మిణీదేవి), శివవల్లభకున్ = శివునిభార్యకు (గౌరికి), మ్రొక్కి, మౌననియతిన్=మునివ్రతమును (మాటలాడకుండుటను), మాని=విడిచి, వెడలెన్=తరలెను.

**తా.** అట్లు పూజింపఁబడిన బ్రాహ్మణదంపతుల యాశీర్వచనములను బొంది రుక్మిణి గౌరికి నమస్కరించి యింటికిఁ బోవఁ దరలెను.

వ. ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగున మృగధరమండలంబు నిర్గమించి చరించుమృగంబుచందంబునఁ గమలభవనర్తకుండెత్తినజవనికమఱుఁగు దెరలి పొడసూపినమోహినీదేవతకైవడి దేవదానవసంఘాత కరతలసవ్యాపసవ్యసమాకృష్యమాణ పన్నగేంద్ర పాశపరివలయిత పర్యాయ పరిభ్రామితమంథరాచలమంథానమథ్యమానఘూర్ణితఘుమఘుమాయితమహార్ణవమధ్యంబుననుండి చనుదెంచునిందిరాసుందరీ వైభవంబున బహువిధప్రభాభాసమాన యై యిందుధరసుందరీమందిరంబు వెలువడి మానసకాసారహేమకమలకాననవిహారమాణ మత్తమరాళంబుభంగి మందగమనంబునఁ గనకకలశయుగళసంకాశ కర్కశపయోధరభారపరికంప్యమానమధ్య యై రత్నముద్రికాలంకృతం బైనకెంగేల నొక్కసఖిలలామంబు కై దండ గొని రత్ననివహసమంచితకాంచన కర్ణపత్త్రమయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప నరవిందపరిమళకుతూ

హాలావతీర్ణమత్తమధుకరంబులమాడ్కి నరాళంబు లైన కుంతలజాలంబులు ముఖమండలంబునం గ్రందుకొన సుందరమందహాసరోచులు దిశలందు బాలచంద్రికాసౌందర్యంబు నావహింప నధరబింబఫలారుణమరీచిమాలికలు రదనకుందకుట్మలంబుల కనురాగంబు సంపాదింప మనోజాతకేతనసన్నిభం బైనపర్యోదకొంగు దూఁగ సువర్ణమేఖలాఘటితమణికిరణపటలంబు లైలకాలశక్రచాపజనకంబు లై మెఱయఁ జెఱకువిలుతుం డొఱ వెఱికి వాఁడి యిడి ఝళిపించిన ధగద్ధగాయమానంబు లగుబాణంబులపగిది సురుచిరవిలోకననికరంబులు రాజవీరులహృదయంబులు భేదింప శింజానమంజుమంజీరనినదంబులు సెవులపండువులు సేయఁ బాదసంచారంబున హరిరాక కెదురు చూచుచు వీరమోహిని యై చనుదెంచుచున్న సమయంబున. 69

టీ. ఇట్లు=ఈప్రకారము, మేఘమధ్యంబున్ = మబ్బునడిమిభాగము నుండి, వెలువడి=బయలువెడలి, విలసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగునన్ = ప్రకాశించు వర్షాకాలపు మెఱుంగువలె, మృగధరమండలంబునన్ = చంద్రమండలమునుండి, నిర్గమించి=వెడలి, చరించుమృగంబుచందంబునన్ = తిరిగెడు జింకవలె (చంద్రమండలమునందలి నల్లనైనదానిని జింకయని చెప్పుట వాడుక. చంద్రమండలములోని జింక యనుటచే సౌందర్యాతిశయము తెలిసెడిని), కమలభవనర్తకుండు = తమ్మిచూలి (బ్రహ్మ) యను నటుఁడు, ఎత్తిన జవనిక మఱుఁగు తెరలి పొడసూపిన మోహినీ దేవతకై వడిన్=పట్టుకొనిన తెఱచాటును దొలఁగి కనఁబడిన మోహినీదేవతవలె, దేవదానవ=దేవతలయొక్కయు రాక్షసులయొక్కయు, సంఘాత=సమూహముయొక్క, కరతల=చేతులచేత, సవ్యాపసవ్య=ఎడమప్రక్కను కుడిప్రక్కను, సమాకృష్యమాణ = ఈడువఁబడుచున్న, పన్నగేంద్రపాశ=పాముతాడు అనుత్రాటిచేత, పరివలయిత=చక్కగాఁ జుట్టఁబడినదియు, పర్యాయ=క్రమముగా, పరిభ్రాంత=తిరుగుచున్నదియునగు,

మంథరఅచల=కవ్వపుఁగొండయనెడు, మంథాన=కవ్వముచేత, మథ్యమాన= చిలుకఁబడుచున్నదియైనను, ఘూర్ణిత=సుళ్లుదిరుగుచున్న, ఘుమఘుమాయిత= ఘుమఘుమయని మ్రోఁగుచున్న, మహార్ణవ = గొప్పసముద్రముయొక్క, మధ్యంబుననుండి=నడుమనుండి, చనుదెంచు నిందిరాసుందరీవైభవంబునన్ = వచ్చుచున్న లక్ష్మీదేవివలె, బహువిధప్రభాభాసమానయై = పలువిధము లగు కాంతులచే వెలుఁగుచున్నదై, ఇందుధర సుందరీ మందిరంబునన్ = చంద్రశేఖరునిభార్య (గౌరియొక్క) గుడినుండి, మానసకాసార=మానససరోవరము నందలి, హేమకమల=పొందామరలయొక్క, కానన=అడవియందు, విహారమాణ = తిరుగుచున్న, మత్త = మదించిన, మరాళంబుభంగిన్ = హంసవలె మందగమనంబునన్ = మెల్లసినడకతో, కనకకలశయుగళ= బంగారుకుండల యొక్క జంటతో, సంకాశ = సమానమగునట్టి, కర్కశ = కఠినములగు, పయోధరభార = కుచభారముచేత, పరికంప్యమాన = మిక్కిలి యసియాడు చున్న, మధ్యయై=నడుముగలదియై, రత్నముద్రికా = రత్నపుటుంగరముచే, అలంకృతంబు = అలంకరింపఁబడినది, అయిన కెంగేలన్ = అయిన యెఱ్ఱని చేతితో, ఒక్కసఖీలలామంబు = ఒకనెచ్చెలియొక్క, కైదండ = చేయూఁతను, కొని, రత్న = రత్నములయొక్క, నివహ = సమూహముచేత, సమంచిత=ఒప్పుచున్న, కాంచన=బంగారుయొక్క, కర్ణపత్త్ర = కమ్మలయొక్క, మయూఖంబులు=కాంతులు, గండభాగంబునన్ = చెక్కిళ్లయందు, నర్తనంబులు=నాట్యములు, సలుపన్ = చేయఁగా (కమ్మలకాంతులు చెక్కిళ్లపై వ్యాపింపఁగా ననిభావము), అరవింద=కమలములయొక్క, పరిమళ = వాసన యందలి, కుతూహల=ఆశచేత, అవతీర్ణ=వచ్చిన, మత్త=మదించిన, మధుకరంబులమాడ్కిన్=తుమ్మెదలవలె, అరాళంబులు=వంకరలు, అయినకుంతల జాలంబులు=అయినవెండ్రుకల సమూహములు, ముఖమండలంబునన్=వట్రువ యగు మోమునందు, క్రందుకొనన్=అతిశయింపఁగా (కమలములకును ముఖమునకును, తుమ్మెదలకును వెండ్రుకలకును, నుపమానోపమేయభావములు.

ఉపమాలంకారము), సుందరమందహాసరోచులు=అందమగు చిఱునగవుకాంతులు, దిశలందున్=దిక్కులయందు, బాలచంద్రికాసౌందర్యంబున్ = లేఁత వెన్నెలలయొక్క యందమును, ఆవహింపన్=కలుగఁజేయఁగా (చిఱునవ్వులు వెన్నెలవలె పరిశుద్ధములై ప్రకాశించుచున్న వని భావము.) అధరబింబఫల అరుణ మరీచిమాలికలు = దొండపండువంటి పెదవియొక్క యెఱ్ఱ కాంతుల వరుసలు, రదనకుంద కుట్మలంబులకున్ = మొల్లమొగ్గలవంటి దంతములకు, అనురాగంబున్=ఎఱ్ఱరంగును, సంపాదింపన్ = కలిగింపఁగా (పెదవి యెఱ్ఱఁగా నున్నదనియుం దంతములు తెల్లగా నున్నవనియు భావము), మనోజాత కేతనసన్నిభంబు = మన్మథుని టెక్కెముతో సమానము, అయినపయ్యెద కొంగు=అయినట్టి పయ్యఁటచెఱఁగు, తూఁగన్=చలింపఁగా, సువర్ణమేఖలా= బంగారువడ్డాణమునందు, ఘటిత = పొదుగఁబడిన, మణి=రత్నములయొక్క, కిరణ=కాంతులయొక్క, పటలంబులు = సమూహములు, అకాలశక్రచాప జనకంబులు ఐ=వర్షాకాలముకాని కాలమునందు నింద్రధనుస్సును బుట్టించునవై, మెఱయన్=ప్రకాశింపఁగా, చెఱకువిల్తుండు=మన్మథుఁడు, ఒఱ=గవుసెననుండి, పెఱికి=తీసి, వాఁడియిడి=పదనుపెట్టి, ఝళిపించినన్ = ఆడింపఁగా, ధగద్ధగాయమానంబులు = ధగధగయని మెఱయుచున్నవి, అగుబాణంబుల పగిదిన్=అయిన బాణములవలె, సురుచిరవిలోకనసికరంబులు = ప్రకాశించు చూపుల వరుసలు, రాజులహృదయంబులు=శూరు లగురాజులయొక్క మనస్సులను, భేదింపన్ = పీడింపఁగా (రుక్మిణిచూపులు మన్మథబాణముల వలె రాజుల హృదయములను భేదించె నని భావము), శింజానమంజీరనినదంబులు = మ్రోఁగుచున్న మనోజ్ఞములగు నందెలచప్పుడులు, చెవుల విందులు = వీనులవిందులు, చేయన్, పాదసంచారంబునన్ = కాలినడకతో, హరిరాకకున్=కృష్ణుని వచ్చుటకు, ఎదురుచూచుచున్, వీరమోహిని ఐ= శూరులను మోహింపఁజేయునదియై, చనుదెంచుచున్న సమయంబునన్=వచ్చునప్పుడు.

మ. అలినీలాలకఁ బూర్ణచంద్రముఖి నేణాక్షిం బ్రవాళాధరన్
గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళం గంధేభకుంభస్తనిం

బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్త మహో
త్పలగంధి మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములైరందఱున్.

టీ. అలినీల అలక = తుమ్మెదలవలె నల్లనైనముంగురులు కలదానిని, పూర్ణచంద్రముఖి = నిండుచంద్రుఁబోలిన మోము కలదానిని, ఏణ-అక్షి=జింకకన్నులవంటికన్నులు గలదానిని, ప్రవాళఅధర =చిగురు (పగడము) వంటి పెదవి కలదానిని, కలకంఠి =మనోజ్ఞ మగు కంఠముగలదానిని, నవపల్లవ అంఘ్రియుగళ = క్రొత్తచిగురువంటి పాదములజంటకలదానిని, గంధ ఇభకుంభ స్తని = మదపుటేనుఁగుయొక్క కుంభస్థలమువంటి కుచములు గలదానిని, పులిన శ్రోణి = ఇసుకదిబ్బలవంటి పిఱుఁదులు కలదానిని, ఇభఇంద్రయాన = గజశ్రేష్ఠముయొక్క నడకవంటి నడకకలదానిని, అరుణఅంభోజాతహస్త =ఎఱ్ఱతామరవంటి చేతులుకలదానిని, మహత్ ఉత్పల గంధి = గొప్పకలువయొక్క వాసనవంటిశరీరవాసన కలదానిని, మృగరాజమధ్య =సింహముయొక్క నడుమువంటి నడుము కలదానిని (ఇట్టిరుక్మిణీదేవిని), కని=చూచి, అందఱున్, విభ్రాంత ఆత్ములు=భ్రమఁజెందినమనస్సు కలవారు, ఐరి.

తా. ఎల్లవిషయములయందును సౌందర్యవతియగు రుక్మిణీదేవిని అందఱు చూచి భ్రమజెందినవారైరి.

వ. మఱియు నయ్యింతి దరహాసలజ్జావలోకనంబులం జిత్తంబు లేమఱి ధైర్యంబులు డిగనాడి గాంభీర్యంబులు విడిచి గౌరవంబులు మఱచి చేష్టలు నూని యొఱుక లుడిగి యాయుధంబులు దిగవైచి గజతురగరథారోహణంబులు సేయ నేరక రాజులెల్ల నేలకు వ్రాలి రా యేణీలోచన తనవామ కరనఖంబుల నలకంబులు దలంగం ద్రోయుచు నుత్తరీయంబు చక్క నొత్తుచుఁ గడకంటిచూపులం గ్రమంబున నా రాజలోకంబు నాలోకించుచు. 71

టీ. మఱియుం, అయ్యింతిదరహాసలజ్జా అవలోకనంబులున్ = ఆరుక్మిణి చిరునగవుతోఁడి సిగ్గుతోఁడి చూపులచేత, చిత్తంబులు = మనస్సులు, ఏమఱి=అజాగ్రత్తపడి, ధైర్యంబులు=ధీరభావంబులను, దిగనాడి = విడిచి, గాంభీర్యంబులు=గంభీరభావంబులను, విడిచి, గౌరవంబులు = మర్యాదలను, మఱచి, చేష్టలు=వ్యాపారములను, మాని, ఎఱుకలు, ఉడిగి=విడిచి, ఆయుధంబులు=శస్త్రములను (కత్తులు మొదలగువానిని), దిగవైచి = నేలనువేసి, గజతురగరథ ఆరోహణంబులు = ఏనుఁగులయు, గుఱ్ఱములయుఁ, అరదములయు నెక్కుటలను, చేయనేరక, రాజులు ఎల్లన్, నేలకున్, వ్రాలిరి=ఒఱిగిరి. ఆయేణీలోచన=జింకకన్నులవంటి కన్నులుగల ఆరుక్మిణి, తనవామకరనఖంబులన్ = తనయెడమచేతి గోళ్లచేత, అలకంబులు=ముంగురులను, తలంగన్ = తొలఁగునట్లు, త్రోయుచున్ (ఇది స్త్రీలస్వభావము), ఉత్తరీయంబున్=పయ్యెదను, చక్కన్, ఒత్తుచున్=సవరించుకొనుచు, ఆరాజలోకంబున్=ఆరాజసమూహమును, కడకంటిచూపులన్=కొనకంటిచూపులచేత, క్రమంబునన్=వరుసగా, ఆలోకించుచున్ = చూచుచు, పైపద్యములోని "కనియెన్" అనుక్రియతో నన్వయము.

మ. కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం • గంఠీరవేంద్రావల
గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశదే
హు నగారాతిగజేంద్రహస్తనిభబాహుం జక్రిఁ బీతాంబ
రున్, ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగ
న్మోహనున్. 72

టీ. రుక్మిణి, చంద్రమండలముఖున్ = చంద్రబింబమువంటి మోముకలవానిని, కంఠీరవ ఇంద్ర అవలగ్నున్=సింహశ్రేష్ఠముయొక్క నడుమువంటి నడుముకలవానిని, నవఅంభోజదళ అక్షున్ = క్రొత్తకమలముల రేకులవంటి కనులుగలవానిని, చారుతరవక్షున్ = మిక్కిలిఅందమగు ఱొమ్ముకలవానిని, మేఘసంకాశదేహున్ = మేఘముతోసమానమగు శరీరకాంతి గలవానిని, నగ = పర్వతములకు, అరాతి = శత్రువగునింద్రునియొక్క, గజేంద్ర=గజ

శ్రేష్ఠముయొక్క (ఐరావతముయొక్క), హస్తనిభ = తొండమువంటి, బాహుఙ్ = చేతులుకలవానిని, చక్రిఙ్ = చక్రాయుధముకలవానిని, పీతఅంబరుఙ్ = పచ్చగుడ్డకలవానిని, ఘనభూష అన్వితుఙ్ = గొప్పసొమ్ములతోఁ గూడినవానిని, కంబుకంఠుఙ్ = శంఖమువంటి కంఠముగలవానిని, విజయ ఉత్కంఠుఙ్ = జయమునందాశగలవానిని, జగత్ మోహనుఙ్ = లోకమును మోహింపఁజేయువానిని (ఇట్టికృష్ణుని), కనియెఙ్ = చూచెను.

తా. జగన్మోహనాకారుం డగు కృష్ణుని రుక్మిణి చూచెను.

వ. కని తదీయరూపవయోలావణ్యవైభవగాంభీర్యచాతుర్యతేజోవిశేషంబులకు సంతసించి మనోభవశరాక్రాంత యై రథారోహణంబుఁ గోరుచున్న వరారోహం జూచి పరిపంథి రాజలోకంబులు సూచుచుండ మందగమనంబున గంధసింధురంబులీలం జనుదెంచి భేరవంబులనడిమిభాగంబుఁ గొని చనుకంఠీరవంబు కైవడి నిఖిలభూపాలగణంబుల గణింపక తృణీకరించి రాజకన్యకం దెచ్చి హరి తనరథంబుమీఁద నిడికొని భూనభోంతరాళంబులు నిండ శంఖంబు పూరించుచు బలభద్రుండు తోడ నడవ యాదవవాహినీపరివృతుం డై ద్వారకానగరమార్గంబుఁ బట్టి చనియె నంత జరాసంధవశులయినరాజు లందఱు హరిపరాక్రమంబు విని సహింపనోపక.

టీ. కని = చూచి, తదీయ = కృష్ణునిదగు, రూప = సౌందర్యముయొక్కయు, వయః = ప్రాయముయొక్కయు, లావణ్య = మెఱుఁగుయొక్కయు, వైభవ = సంపదయొక్కయు, గాంభీర్య = గంభీరభావంబుయొక్కయు, చాతుర్య = నేర్పుయొక్కయు, తేజః = ప్రతాపముయొక్కయు, విశేషంబులకుఙ్ = అతిశయములకు, సంతసించి = సంతోషపడి, మనోభవశరఆక్రాంత యై = మన్మథబాణములచేఁ జుట్టఁబడినదై, రథఆరోహణంబుఙ్ = రథము నెక్కుటను, కోరుచున్నవర ఆరోహఙ్ = అపేక్షించు శ్రేష్ఠములగు పిఱుఁదులుగల

దానిని, చూచి, పరిపంథిరాజలోకములు=శత్రురాజులసమూహములు, చూచుచుఁ, ఉండఁ, మందగమనంబునఁ = తిన్ననినడకతో, గంధసింధురంబులీలఁ=మదపుటేనుఁగువలె, చనుదెంచి=వచ్చి, ఫేరవంబునడిమి భాగంబుఁ = నక్కలనడిమిపాలిని, కొనిచనుకంఠీరవంబుకైవడిఁ = తీసికొనిపోవు సింహమువలె, నిఖిలభూపాలగణంబులఁ = ఎల్లరాజసమూహములను, గణింపక = లక్ష్యపెట్టక, తృణీకరించి = తృణముగాఁ జేసి (చిన్నఁబుచ్చి యని భావము.), రాజకన్యకఁ=రాకన్నెను (రుక్మిణిని), తెచ్చి, హరి=కృష్ణుఁడు, తనరథంబుమీఁదఁ, ఇడికొని = ఉంచుకొని, భూనభః అంతరాళంబులు= భూమియొక్కయుం ఆకసముయొక్కయుం మధ్యభాగములు, నిండఁ, శంఖంబు=శంఖమును, పూరించుచుఁ = ఊఁదుచు, బలభద్రుండు = బలరాముఁడు, తోడనడవఁ = వెంటరాఁగా, యాదవవాహినీ పరివృతుండై=యాదవసేనచేఁ జుట్టఁబడినవాఁడై, ద్వారకానగరమార్గంబునఁ = ద్వారకాపట్టణముదారిని, పట్టి=పొంది, చనియెఁ, అంతఁ = పిమ్మట జరాసంధవశులు= జరాసంధునికి నధీనులు, అయిన రాజులు, అందఱు, హరిపరాక్రమంబుఁ= కృష్ణునిశూరత్వమును, విని, సహింపనోపక = ఓర్వఁజాలక.

మ. ఘనసింహంబులకీర్తి నీచమృగముల్ • గైకొన్నచందంబునన్
మనకీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు నున్మాదంబుతో
గోపకుల్, సను చున్నా రదె శౌర్య మెన్నఁటికి మీ • శస్త్రా
స్త్రముల్ గాల్పనే, తనుమధ్యన్ విడిపింప మేని నగరే •
ధాత్రీజనుల్ గ్రంతలన్. 74

టీ. ఘనసింహంబులకీర్తి = గొప్పసింహములకీర్తిని, నీచమృగముల్= అల్పజంతువులు, కైకొన్నచందంబునఁ = గ్రహించినవిధమున, మనకీర్తుల్ = మనయశస్సులను, కొని, బాలఁ=రుక్మిణిని, తోడ్కొనుచుఁ=వెంటఁబెట్టుకొనుచు, ఉన్మాదంబుతోడఁ = చిత్తవిభ్రమముతో (మైమఱపుతో), గోపకుల్ =గొల్లలు, అదె=అదిగో, చనుచున్నారు = పోవుచున్నారు, శౌర్యము= పరాక్రమము, ఎన్నఁటికిఁ = ఎప్పటికి, మీశస్త్రఅస్త్రముల్ =మీకత్తులును

బాణములును, కాల్పక్ ఏ = తగులఁబెట్టనా ? తనుమధ్యక్ = సన్నని నడుము గలదానిని (రుక్మిణిని), విడిపింపము ఏనిక్ = వదలింపనిపక్షమున, ధాత్రీ జనుల్ = పుడమిలోనిజనులు, క్రంతలక్ = సందుగొందులయందు, నగరువే = నవ్వరా? (నవ్వుదురు అని భావము).

తా. సింహములకీర్తిని నీచమృగములు కొనిపోవునట్లు గొల్లలు మన కీర్తులను బోఁగొట్టి రుక్మిణిం దీసికొని పోవుచున్నారు. మనమిప్పుడు ఊరక యున్నయెడ పుడమియందలివారు మనలఁ బరిహసింపకుందురా! అలంకారము-ఉపమ.

వ. అని యొండొరులం దెలుపుకొని రోషంబులు హృదయంబుల నిలుపుకొని సంరంభించి తనుత్రాణంబులు వహించి ధనురాదిసాధనంబులు ధరియించి పంతంబు లాడి తమ తమచతురంగబలంబులం గూడి జరాసంధాదులు యదు వీరుల వెంటం దాఁకి నిలు నిలుం డని ధిక్కరించి పలికి యుక్కు మిగిలి మహీధరంబులమీఁద సలిలధారలు గురి యుధారాధరంబులచందంబున బాణవర్షంబులు గురిసిన యాదవసేనలం గలదండనాయకులు కోదండంబు లెక్కిడి గుణంబులు మ్రోయించి నిలువంబడి రప్పుడు. 75

టీ. అని = ఈప్రకారము చెప్పుకొని, ఒండొరులక్ = ఒకరొకరిని, తెలుపుకొని = తెలియఁజేసికొని, రోషంబులు = మాత్సర్యములు, హృదయంబులక్ = మనసులయందు, నిలుపుకొని = ఉంచుకొని, సంరంభించి = తొట్రుపాటుపడి, తనుత్రాణంబులక్ = మైమఱువులను (కవచములను), వహించి = తొడిఁగి, ధనుః ఆదిసాధనంబులు = విల్లుమొదలగు (యుద్ధ) ఉపకరణములను, ధరియించి = తాల్చి, పంతంబులు ఆడి = ప్రతిజ్ఞలుచేసి, తమ తమచతురంగబలంబులక్ = వారివారినాలుగు అంగములు (రథగజతురగపదాతులు) గల సేనలను, కూడి = కలసి, జరాసంధాదులు = జరాసంధుఁడు మొదలుగాఁ గలవారు, యదువీరులవెంటక్ = యాదవశూరులవెంబడి, అంటక్ = తగులునట్లు, తాఁకి = ఎదుర్కొని, నిలునిలుండు = నిలువుఁడు నిలువుఁడు, అని, ధిక్కరించి =

నిందించి, పలికి, ఉక్కుమిగిలి = బలముమీఱి, మహీధరంబులమీఁదన్ = పర్వతములమీఁద, సలిలధారలు = ఉదకధారలను, కురియుంధారాధరంబుల చందంబునన్ = వర్షించు మేఘంబులవలె, బాణవర్షములు = అంబవానలు, కురిసినన్ = వర్షింపఁగా (వేయఁగానని యనుట), యాదవసేనలన్ = కృష్ణునిసేనలలో, కలదండనాథులు = ఉన్నసేనాపతులు, కోదండంబులు = ధనుస్సులను, ఎక్కుఇడి = మోపెట్టి, గుణంబులు = అల్లెత్రాళ్లను, మ్రోయించి = టంకారముచేసి, నిలువంబడిరి, అప్పుడు = ఆసమయమునందు.

క. అరిబలభటసాయకముల
హరిబలములు గప్పఁబడిన • నడరెడుభీతిన్
హరిమధ్య సిగ్గుతోడను
హరివదనముఁ జూచెఁ జకిత•హరిణేక్షణయై. 76

టీ. అరిబలభటసాయకములన్ = శత్రుసేనలభటులబాణములచేత, హరిబలములు = కృష్ణునిసేనలు, కప్పఁబడినన్ = కప్పఁబడఁగా, అడరెడు భీతిన్ = అతిశయించు భయముతో, హరిమధ్య = సింహమునడుమువంటి నడుముగలది (రుక్మిణి), సిగ్గుతోడను, చకిత హరిణ ఈక్షణయై = బెదరినలేడి కనులవంటి కనులుగలదై, హరివదనమున్ = కృష్ణుని మోమును, చూచెన్ = చూచెను.

తా. రుక్మిణి శత్రుసేనచేఁ గప్పఁబడిన కృష్ణునిసేనంజూచి భయపడి సిగ్గుతోఁ గృష్ణునిం జూచెను.

వ. ఇట్లు చూచిన. 77

క. వచ్చెద రదె యదువీరులు
వ్రచ్చెద రరిసేన నెల్ల • వైరులు పెలుచన్
నొచ్చెదరును విచ్చెదరును
జచ్చెదరును నేఁడు చూడు • జలజాతాక్షీ! 78

టీ. జలజాత అక్షీ = కమలమువంటి కనులు గలదానా! (రుక్మిణి సంబోధనము.) యదువీరులు = యాదవశూరులు, అదె = అదిగో, వచ్చెదరు. అరిసేనన్ = శత్రుసేనను, ఎల్లన్ = అంతయును, వ్రచ్చెదరు = చీల్చెదరు.

వైరులు=శత్రువులు, పెలుచన్=మిక్కిలి, నొచ్చెదరును=నొప్పిఁజెందెదరును, విచ్చెదరును=చీలుదురును, చచ్చెదరును, చూడు.

తా. మనయాదవసేన లవిగో వచ్చుచున్నవి. శత్రునాశము చేయును. శత్రువులు నొప్పిఁజెందుటయును, నానాదిక్కులకును బరువిడుటయును, చావును నీవిప్పుడు చూతువు.

వ. అని రుక్మిణీదేవిని హరి యూఱడించె నంత బలభద్రప్రము
ఖులైనయదువీరులు ప్రళయవేళ మిన్నునంబన్ని బలుపిడుగు
లడరించు పెనుమొగుళులవడువున జరాసంధాదిపరిపంథి
రాజచక్రంబుమీఁద నవక్రపరాక్రమంబున శిఖిశిఖాసంకాశ
నిశితశిలీముఖనారాచభల్లప్రముఖంబులైనబహువిధబాణ
పరంపరలు గురియ నదియును విదళితమత్తమాతంగంబును
విచ్ఛిన్నతురంగంబును విచ్ఛిన్నరథవరూథంబును వినిహత
పదాతియూథంబును విఖండితవాహవారణ రథారోహణ
మస్తకంబునువిశకలితవక్షోమధ్యకర్ణకంఠకపోలహస్తంబును
విస్ఫోటితకపాలంబును వికీర్ణకేశజాలంబును విపాటితచరణ
జానుజంఘంబును విదళితదంతసంఘంబును విఘటితవీరమం
జీరకేయూరంబును విభ్రష్టకుండలకిరీటహారంబును విశ్రుత
వీరాలాపంబును విదార్యమాణగదాకుంత తోమరపరశుప
ట్టిసప్రాసకరవాలశూలచక్రచాపంబును వినిపాతితకేతనచా
మరచ్ఛత్రంబును విలూనతనుత్రాణంబును వికీర్యమాణఘో
టక సంఘురింఖాసముద్ధూతధరణీపరాగంబును వినష్టరథవే
గంబునువినివారితసూతమాగధవందినాదంబునువికుంఠితహ
యహేషాపటహభాంకారకరటిఘీంకారరథనేమి పట
పటాత్కారతురగనాభి ఘంటాఘణఘణాత్కార.వీరహుం
కారభూషణ ఝణఝణాత్కార నిస్సాణ ధణధణాత్కార

మణినూపుర క్రేంకారకింకిణీకిణకిణాత్కార శింజినీటంకార భట పరస్పరధిక్కారనాదంబును వినిర్భిద్యమాన రాజ సమూహంబును విద్యమానరక్తప్రవాహంబును విక్రీయ మాణభూత బేతాళకలకలంబును విజృంభమాణ ఫేరవకాక కంకాదిసంకులంబును ప్రచలితకబంధంబును ప్రభూతపలల గంధంబును ప్రదీపిత మేదోమాంసఖాదనంబును ప్రవర్తిత ఢాకినీప్రమోదంబును నై యుండె నప్పుడు. 79

టీ. అని=ఈప్రకారము చెప్పి, రుక్మిణీదేవిని, హరి = కృష్ణుఁడు, ఊఱడించెన్=ఓదార్చెను, అంత=అటుపిమ్మట, బలభద్రప్రముఖులు = బలరాముఁడు మొదలుగాఁగలవారు, అయినయదువీరులు = అయినట్టియాదవ శూరులు, ప్రళయవేళన్ = కల్పాంతములయందు, మిన్నునన్ = ఆకసమునందు, పన్ని=ఏర్పడి, బలుపిడుగులు, అడరించు = కలుగఁజేయునట్టి, పెను మొగుళ్లపడువున = గొప్పమబ్బులవలె, జరాసంధ ఆదిపరిపంథి రాజచక్రంబుమీఁదన్ = జరాసంధుఁడు మొదలుగాఁగల శత్రురాజుల సమూహంబుపైని. అవక్రపరాక్రమంబునన్ = అతిశయమగు వీర్యముచేత, శిఖి = అగ్నియొక్క, శిఖాసంకాశ = మంటలవలె, నిశిత=పదునైన, శిలీముఖ = బాణములు, నారాచ = ఇనుపబాణములు, భల్ల=బల్లెములు, ప్రముఖంబులు = మొదలుగాఁగలవి, ఐనబహువిధబాణపరంపరలు = అయినట్టి పలువిధములగు బాణములవరుసలు, కురియన్, అదియును = ఆబాణవర్షమును, విదళితమత్త మాతంగంబును = నఱుకఁబడిన మదించిన యేనుఁగులుగలదియును, విచ్ఛిన్న తురంగంబును = నఱుకఁబడిన గుఱ్ఱములు కలదియును, విచ్ఛిన్నరథవరూథంబును = విఱుగఁగొట్టఁబడిన రథముసెమ్ములు గలదియును, వినిహతపదాతియూథంబును = చంపఁబడినకాల్బలముల సమూహము గలదియును, విఖండితవాహవారణరథారోహణమస్తకంబును = నఱుకఁబడిన గుఱ్ఱములయు యేనుఁగులయు రథికులయుఁ దలలుకలదియును, విశకలిత = తునకలు చేయఁబడిన, పక్షః = ఱొమ్ము, మధ్య = నడుము, కర్ణ=చెవులు, కంఠ = మెడ, కపోల = చెక్కిళ్లు, హస్తంబులు = చేతులుగలదియును, విస్ఫోటితకపాలం

బును=చీల్పఁబడిన తలపుఱ్ఱెలు కలదియును, వికీర్ణకేశజాలంబును = వీడిన వెండ్రుకల సమూహంబులు గలదియును, విపాటితచరణజానుజంఘంబును = చీల్పఁబడిన కాళ్లును మోఁకాళ్లును పిక్కలును గలదియును, విదళితదంతసంఘంబును = రాలఁగొట్టఁబడిన పండ్లసమూహముగలదియును, విఘటితమంజీరకేయూరంబును = పగులఁగొట్టఁబడిన శూరులయందెలును భుజకీర్తులును కలదియును (శూరులు తమశౌర్యము తెలియుటకై యందెలను ధరించుట సంప్రదాయము.) విభ్రష్టకుండల కిరీటహారంబును = జాఱినపోఁగులు కిరీటములు ముత్యాలహారములు కలదియును, విశ్రుతవీర ఆలాపంబును = వినఁబడుచున్నశూరుల నాదంబులు కలదియును, విదార్యమాణ = విఱుపఁబడుచున్న, గదా=గుదియలు, కుంత=ఈఁటెలు, తోమర=చిల్లకోలలు, పరశు=గండగొడ్డళ్లు, పట్టిస= అడ్డకత్తులు, ప్రాస = ఆయుధవిశేషములు, కరవాల=ఖడ్గములు, శూల=కొఱ్ఱులు, చక్ర = చక్రమువంటి ఆయుధములు, చాపంబులు = ధనుస్సులుకలదియును, వినిపాతితకేతనచ్ఛత్రచామరంబును = పడఁగొట్టఁబడిన పెక్కెములు గొడుగులు వింజామరలుకలదియును, విలూనతనుత్రాణంబును = నఱుకఁబడినకవచములుకలదియును, వికీర్యమాణ = చల్లఁబడుచున్న, ఘోటక = గుఱ్ఱములయొక్క, సంఘ=సమూహముయొక్క, రింఖ=గిట్టలచేత (డెక్కలచేత), సముద్ధూత = ఎగురఁగొట్టఁబడిన, ధరణీ=పుడమియొక్క, పరాగంబును=దుమ్ముకలదియును, వినష్టరథవేగంబును = పోఁగొట్టఁబడిన తేరులవేగము కలదియును, వినివారితసూతమాగధవందినాదంబును = నిలుపఁబడినసూతులయొక్క వంశములఁ బొగడువారియు భట్టువాండ్రయొక్క స్వనములుకలదియును, వికుంఠిత = అడ్డగింపఁబడిన, హయ=గుఱ్ఱముల యొక్క, హేషా = సకిలింతలయొక్క, పటహ = తప్పెటలయొక్క, భాంకార=భాంకారములయొక్క, కరటి = ఏనుంగులయొక్క, ఘటా = గుంపులయొక్క, ఘీంకార = ఘీంకారములయొక్క, రథ=తేరులయొక్క, నేమి=అంచులయొక్క. నాభి=పొక్కిలియందలి, ఘంటా = గంటలయొక్క, ఘణఘణాత్కార=ఘణఘణాత్కారములయొక్క (గుఱ్ఱములనాభియందు ఘంటలు కట్టియున్నవనిభావము), వీర=శూరులయొక్క, హుంకార=హుంకారములయొక్క, భూషణ = సొమ్ములయొక్క, ఝణఝణాత్కార = ఝణఝణాత్కారములయొక్క, మణి

నూపుర = రత్నపుటందెలయొక్క, క్రేంకార = క్రేంకారములయు, కిం కిణి = చిఱుగంటలయొక్క, కిణకిణాత్కార = కిణకిణాత్కారములయు, ఝింఝీ = అల్లెత్రాటియొక్క, టంకార = టంకారములయు, భట = బంట్లయొక్క, పరస్పర = ఒకరొకరియొక్క, ధిక్కార = ధిక్కారములయొక్క, నాదంబును = ధ్వనులుకలదియును, (ఇందలిఝాంకారాదిశబ్దములు అనుకరణ వాచకములు) వినిర్భిద్యమాన రాజసమూహంబును = భేదింపఁబడుచున్న రాజసమూహములుకలదియును, విద్యమాన రక్తప్రవాహంబును=కలుగుచున్న నెత్తురుపఱదలు కలదియును, విశ్రూయమాణభూతబేతాళకలకలంబును = వినఁబడుచున్న పిశాచములయు యమకింకరులయు కూఁతలుకలదియును, విజృంభమాణ ఫేరవ కాక కంక ఆది సంకులంబును = వృద్ధిఁబొందుచున్న నక్కలు కాకులు రాపులుఁగులు మొదలగువానిచే వ్యాప్తమయినదియును, ప్రచలితకబంధంబును=ఎగురుచున్న మొండెములు కలదియును, ప్రభూత పలలగంధంబును = ఎక్కువయగు మాంసముయొక్క వాసనగలదియును, ప్రదీపిత మేదః మాంసరుధిర ఖాదనంబును=ప్రకాశించు మెదళ్లయు మాంసములయు నెత్తురులయు భక్షణంబు కలదియును, ప్రవర్తిత డాకినీప్రమోదంబును ఐ = కలుగుచున్న పిశాచస్త్రీలసంతోషము కలదియును అయి, ఉండెన్, అప్పుడు.

చ. మగిడి చలించి పాఱుచును • మాగధముఖ్యులు గూడి యొ
క్కచోఁ, వగచుచు నాలిఁ గోల్పడిన•వాని క్రియం గడు వెచ్చ
నూర్చుచున్, మొగమున దప్పిదేఱఁ దమ•ముందఱఁ బొ
క్కుచు నున్న చైద్యుతోఁ, బగతులచేతిలోఁ బడక • ప్రాణ
ముతోడుత నున్నవాఁడవే. 80

టీ. మగిడి = మరలి, చలించి=కదలి, పాఱుచును = పరుగెత్తుచును, మాగధముఖ్యులు = జరాసంధుఁడు మొదలుగాఁగలవారు, ఒక్కచోటన్, కూడి=చేరి, ఆలిన్ = భార్యను, కోల్పడినవానిక్రియన్ = పోఁగొట్టుకొన్న వానివలె, వగచుచున్ = దుఃఖించుచు, కడున్ = మిక్కిలి, వెచ్చన్ = వేఁడిగా, ఊర్చుచున్ = ఊపిరివిడుచుచు, మొగమునన్=ముఖమున, దప్పి

తేఱన్ = శ్రమపడఁగా, తమముందఱన్ = తమయెదుట, పొక్కుచున్ = దుఃఖించుచు, ఉన్నచైద్యుతోన్ = ఉన్నశిశుపాలునితో, పగతురచేతి లోన్ = శత్రువులచేతిలో, పడక=చిక్కక, ప్రాణముతోడుతన్ = ప్రాణము గలిగి, ఉన్నవాఁడవు ఏ.

తా. ఆజరాసంధుఁడు మొదలగువారు యుద్ధమున నోడి మరలిపోవు వారు ఒక్కచోట కలిసి .భార్యను బోఁగొట్టుకొన్నవానిరీతిని దుఃఖించుచున్న శిశుపాలునిం జూచి ప్రాణములతో నున్నావుకదా యని యడిగిరి. అలంకారము=ఉపను.

ఆ. బ్రతుకవచ్చు నొడలఁ • బ్రాణంబు లుండిన
బ్రతుకు గలిగె నేని • భార్య గలదు
బ్రతికి తీవు భార్య • పట్టు దైవ మెఱుంగు
వగవవలదు చైద్య • వలదు వలదు. 81

టీ. ఒడలన్ = దేహమునందు, ప్రాణంబులు ఉండినన్, బ్రతుక వచ్చున్, బ్రతుకు, కలిగెన్ ఏనిన్ = ఉన్నపక్షమున, భార్య, కలదు, ఈవు, బ్రతికితి, భార్యపట్టు = భార్యవిషయము, దైవము, ఎఱుంగున్, చైద్య=శిశుపాలా! వగవవలదు=దుఃఖపడవలదు.

తా. శిశుపాలా! శరీరమునఁ బ్రాణంబులున్న జీవనమును సంపాదించుకొనవచ్చును. బ్రతుకు గలిగినయెడ భార్యయును దొరకును. యాదవులచేఁబడక నీవు బ్రతికితివి. అంతియ చాలును. భార్యాలాభము దైవమునకుఁ దెలియును. నీవు చింతిల్లకుము. అలంకారము-కారణమాల.

వ. వినుము దేహధారి స్వతంత్రుండు గాఁడు. జంత్రగానిచేతి జంత్రపుబొమ్మకైవడి నీశ్వరతంత్రపరాధీనుం డై సుఖదుఃఖంబులయందు వర్తనంబులు సలుపుఁ దొల్లి నేను మధురాపురంబుపైఁ బదియేడుమాఱులు పరాక్రమంబున విడిసి యాసప్తదశవారంబులను జక్రిచేత నిర్ధూలితబలచక్రుండనై కామపాలుచేతం బట్టువడి యాకృష్ణుండు కరుణా

చేసి విడిపించి పుచ్చిన వచ్చి క్రమ్మఱ నిరువదిమూఁ
డక్షౌహిణులం గూడికొని పదునెనిమిదవమాఱు దాడిచేసి
శత్రులం దోలి విజయంబు చేకొంటి నిట్టిజయాపజయంబు
లందు హర్షశోకంబుల నెన్నఁడునుం జెంద నేఁటిదినంబున
నీకృష్ణుని కెదిరి పోర మనరాజలోకం బెల్ల నుగ్రాక్షుం
గూడికొని పోరిన నోడుదు మింతియకాక దైవయుక్తం
బయిన కాలంబునం జేసి లోకంబులు పరిభ్రమించు చుండు
నవియునుం గాక. 82

**టీ.** వినుము=(ఓశిశుపాలా! నీవు) వినుము. దేహధారి = దేహమును ధరించినవాఁడు (జంతువు), స్వతంత్రుండు = సొంతగాఁడు, కాఁడు, జంత్రగానిచేతి జంత్రపు బొమ్మకైవడిన్ = యంత్రగానిచేతి యంత్రపుబొమ్మవలె, ఈశ్వరతంత్రపర అధీనుండు ఐ=ఈశ్వరునియిచ్ఛకు లోఁబడినవాఁడై, సుఖదుఃఖంబులందున్, నర్తనంబులు=నటనములు, సలుపున్=చేయును. తొల్లి=పూర్వము, నేను (జరాసంధుఁడనుట), మధురాపురంబుపైన్, పదియేడుమాఱులు, పరాక్రమంబునన్, విడిసి=ముట్టడించి, ఆసప్తదశవారంబులు = ఆపదియేడుమాఱులు, చక్రిచేతన్ = కృష్ణునిచేత, నిర్మూలితబలచక్రుండనై = నాశముచేయఁబడిన సేనాసమూహము గలవాఁడనై, కామపాలుచేతన్=బలరామునిచేత, పట్టువడి=చిక్కి, ఆకృష్ణుండు, కరుణచేసి = దయతో, విడిపించి పుచ్చినన్=విడిపించిపంపించగా, వచ్చి, క్రమ్మఱన్=మరల, ఇరువదిమూఁడు అక్షౌహిణులన్=ఇరువదిమూఁడు అక్షౌహిణులసంఖ్యగలసేనను (21870 రథములు, 21870 ఏనుంగులు, 65610 గుఱ్ఱములు, 109350 కాల్వురను గలసేన ఒకయక్షౌహిణి యనఁబడు), కూడుకొని = కలసికొని, పదునెనిమిదవమాఱు, దాడిచేసి=యుద్ధయాత్ర వెడలి, శత్రులన్, తోలి=తఱిమి, విజయంబు=గెలుపును, చేకొంటిని=పొందితిని. ఇట్టిజయ అపజయంబులందున్=ఇట్టిగెలుపునందును నోటునందును, హర్షశోకంబులన్=సంతోష దుఃఖములను (గెలుపువలన సంతోషమును ఓడువలన దుఃఖము ననిభావము), ఎన్నఁడునున్=ఎప్పుడును,

చెందరు = పొందరు, నేఁటిదినంబునన్, ఈకృష్ణునికిన్, ఎదిరిపోరన్ = ఎదిరిన యుద్ధము, రాజలోకంబెల్ల = రాజసమూహమంతయును, ఉగ్రఅక్షున్ = వేఁడి కన్నులుగలవానిని (శివుని), కూడుకొని, ఎదిరి, పోరినన్, ఓడుదుము. ఇంతియు కాక = ఇంతేకాకుండ, దైవయుక్తంబు = దైవాధీనము, అయినకాలంబునం జేసి = అయినట్టికాలముచేత, లోకంబులు = జంతువులు, పరిభ్రమించుచున్ ఉండున్ = తిరుగుచుండును, అదియునుంగాక.

మ. తమకుం గాలము మంచిదైన మనలం ద్రైలోక్యవిఖ్యాతవి
క్రములం గెల్చిరి యాదవుల్ హరిభుజాగర్వంబునన్ నేఁడు
కాలము మేలై చనుదెంచెనేని మనముం గాలక్షించి విద్వేషు
లన్, సమరక్షోణి జయింత మింతపనికై శంకింప నీకేటికిన్.

టీ. యాదవుల్, తముకున్, కాలము, మంచిదైనన్, నేఁడు, హరిభుజాగర్వంబునన్ = కృష్ణునిభుజగర్వముచేత, త్రైలోక్యవిఖ్యాతవిక్రములన్ = ముల్లోకములయందుఁ బ్రసిద్ధికెక్కిన పరాక్రమముగల, మనలన్, గెల్చిరి, మనమున్, కాలము, మేలు ఐ = మంచిదై, చనుదెంచెన్ ఏనిన్ = వచ్చినపక్షమున, విద్వేషులన్ = శత్రువులను, లక్షించి = చూచి, సమరక్షోణిన్ = యుద్ధభూమియందు, జయింతము = గెలుతము, ఇంతపనికి ఐ = ఇంతకార్యమునకై, నీకు, శంకింపన్ ఏటికిన్ = చింతపడవలసిన దెందుకు ?

తా. యాదవులు తమకు మంచికాలమయినందున మనలను జయించిరి. మనకును మంచికాలము వచ్చినప్పుడు వీరిని జయింతము. కావున చింత వల దని జరాసంధాదులు శిశుపాలునితోఁ జెప్పిరి.

వ. అని యిట్లు జరాసంధుండు నతనియొద్దిరాజులును శిశుపాలునిపరితాపంబు నివారించి తమతమభూములకుఁ జనిరి. శిశుపాలుండు ననుచరసేనాసమేతుం డై తననగరంబునకుం జనియె, నంత రుక్మి యనువాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబునం దనచెలియలిం గొనిపోవుటకు సహింపక యేకా

క్షౌహిణీబలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెను
దవిలి పోవుచుఁ దనసారథితో నిట్లనియె. 84

టీ. అని, యిట్లు, జరాసంధుఁడు, ఆతనియొద్దిరాజులును, శిశుపాలుని పరితాపంబుఁ = శిశుపాలుని సంతాపమును, నివారించి = పోఁగొట్టి, తమ తమభూములకుఁ = తమతమదేశములకు, చనిరి = పోయిరి. శిశుపాలుండును, అనుచరసేనాసమేతుండు ఐ = సేవకులతోను సేనలతోను కూడినవాఁడై, తన నగరంబునకుఁ = తన పట్టణమునకు, చనియెఁ = పోయెను. అంతన్, రుక్మి యనువాఁడు, కృష్ణుండు, రాక్షసవివాహంబునఁ, తనచెలియలిఁ, కొని పోవుటకుఁ, సహింపక = ఓర్వక, ఏక అక్షౌహిణీబలంబుతోడఁ = ఏక అక్షౌహిణీసంఖ్యగలసేనతో, సమరసన్నాహంబునఁ = యుద్ధప్రయత్నముతో, కృష్ణుని వెనుదవిలి = కృష్ణుని వెంబడించి, పోవుచుఁ, తనసారథితోఁ, ఇట్లు, అనియెఁ.

ఉ. బల్లిదు నన్ను భీష్మజన•పాలకుమారునిఁ జిన్నఁ జేసి నా, చెల్లెలి
రుక్మిణిం గొనుచుఁ•జిక్కక నిక్కపుబంటువోలె నీ, గొల్లఁడు
వోయెడిఁ రథముఁ•గూడఁగఁ దోలుము తేజితోల్లస, ద్భల్ల
పరంపరఁ మదముఁ • బాపెదఁ జూపెద నాప్రతాపమున్.

టీ. బల్లిదుఁ = బలముగలవానిని, భీష్మజనపాలకుమారుఁ = భీష్మరాజుకుమారుని, నన్నుఁ, చిన్నఁ = చిన్నవానిని, చేసి, నాచెల్లెలిఁ, రుక్మిణిఁ, కొనుచుఁ = తీసికొనిపోవుచు, చిక్కక = చిక్కుపడక, నిక్కపుబంటు వోలెఁ = కపటములేనిభటునివలె, ఈగొల్లఁడు = ఈగొల్లవాఁడు (కృష్ణుఁడు), పోయెడిఁ = పోవుచున్నాఁడు, రథముఁ = (నా) తేరిని, కూడఁగఁ = కలియునట్లు, తోలుము, తేజితఉల్లసత్ భల్లపరంపరఁ = వాఁడిచేయఁబడినదియు ప్రకాశించునదియు నగుబల్లెములవరుసచేత, మదముఁ = (కృష్ణుని) గర్వమును, పాపెదఁ = పోఁగొట్టెదను, నాప్రతాపము = నాపరాక్రమము, చూపెదఁ.

తా. పరాక్రమశాలియగు నన్నులక్ష్యముచేసి నాచెల్లెలిని నీకృష్ణుఁడు

గాని వోవుచున్నవాఁడు. నా తేరిని శీఘ్రముగా నడుపుము. వానిగర్వము నణఁచెదనని సారథితో రుక్మి చెప్పెను.

వ. అని యిట్లు రుక్మి హరికొలంది యెఱుంగక సారథి నదలించి రథంబుఁ గూడం దోలించి గోపాలక! వెన్నముచ్చ! నిమిష మాత్రంబు నిలునిలు మని తిరస్కరించి బలువింట నారి యెక్కించి మూఁడువాఁడితూపుల హరి నొప్పించి యిట్లనియె.

టీ. అని, యిట్లు, రుక్మి, హరికొలంది=కృష్ణునిపరిమాణము (పరాక్రమమునసుట), ఎఱుంగక, సారథిన్, అదలించి=బెదరించి, రథంబున్, గూడన్=(కృష్ణుని) తేరితో కలియునట్లు, తోలించి, గోపాలక = ఆవులను మేఁపువాఁడా! వెన్నముచ్చ=వెన్నదొంగిలువాఁడా! సిమిషమాత్రంబు=రెప్పపాటంతకాలము, నిలునిలుము, అని, తిరస్కరించి=అపమానించి, బలువింటన్=పెద్దధనుస్సునందు, నారి = అల్లెత్రాటిని, ఎక్కించి = ఎక్కుపెట్టి (కూర్చి), మూఁడు వాఁడితూపులన్=చుఱుకైనమూఁడు బాణములచేత, హరిన్=కృష్ణుని, నొప్పించి, ఇట్లు, అనియెన్.

సీ. మాసరివాఁడవా • మాపాపఁ గొని పోవ
నేపాటిగలవాఁడ • వేదివంశ
మెందు జన్మించితి • వెక్కడఁ బెరిఁగితి
వెయ్యది నడవడి • యెవ్వఁ డెఱుఁగు
మానహీనుఁడ వీవు • మర్యాద లెఱుఁగవు
మాయఁ గైకొనికాని • మలయ గావు
నిజరూపమున శత్రు•నివహంబుపైఁ బోవు
వసుధేశుఁడవు గావు • వావి లేదు

ఆ. కొమ్మ నిమ్ము నీవు • గుణరహితుండవు
విడువు విడువ వేని • విలయకాల
శిఖిశిఖాసమాన • శితశిలీముఖముల
గర్వ మెల్లఁ గొందుఁ • గలహమందు. 87

టీ. మాపాపన్ = మాబిడ్డను (రుక్మిణిని), కొనిపోవన్ = తీసికొనిపోవు టకు, మాసరివాఁడవు అ = మాకుసమానుఁడవా ! ఏపాటి = ఎంతకొలఁది, కల వాఁడవు, వంశము = కులము, ఏది = ఎక్కడిది (కులమే లేదనియర్థము), ఎం దున్ = ఎచ్చటను, జన్మించితివి = పుట్టితివి, ఎక్కడన్, పెరిఁగితివి, నడవడి = ఆచారము, ఎయ్యది = ఎట్టిది, ఎవ్వఁడు, ఎఱుఁగున్, ఈవు = నీవు, మానహీనుఁ డవు = మానముచే విడువఁబడినవాఁడవు (గౌరవములేనివాఁడ వనిభావము.), మర్యాదలు, ఎఱుఁగవు, మాయన్ = మోసమును, కైకొనికాని = పొందిననే కాని, మలయన్ = పెనఁగుటకు (యుద్ధమునకని భావము), ఈవు, నిజరూప మునన్ = సొంతరూపముచేత, శత్రునివహంబుపైన్ = శత్రురాజుల మీఁదికి, పోవు వసుధేశుఁడవు = పోవునట్టి పుడమిఱేఁడవు, కావు, వావి = వరుస, లేదు, కొమ్మన్ = స్త్రీని (రుక్మిణిని), ఇమ్ము, నీవు గుణరహితుండవు = గుణముచే విడు వఁబడినవాఁడవు, విడువు = (మారుక్మిణిని) వదలుము, విడువవు ఏనిన్ = విడిచి పెట్టనిపక్షమున, విలయకాల = ప్రళయకాలమునందలి, శిఖి = అగ్నులయొక్క, శిఖా = మంటలకు. సమాన = సాటియైన, శిత = చుఱుకైన, శిలీముఖములన్ = బాణ ములచేత, కలహమందున్ = యుద్ధమునందు, గర్వము = కావరమును, ఎల్లన్ = అంతయును, కొంతున్ = గ్రహింతును.

తా. మా రుక్మిణిని గొనిపోవుటకు నీవు మా సమానమైనవాఁడవుగావు. భాగ్యవంతుఁడవు కావు. నీవు గొప్పవంశమునఁ జేరినవాఁడవును గావు. నీవు పుట్టినచోటును పెరిఁగినచోటును ఎవ్వరికిని దెలియదు. నీవు గౌరవము లేని వాఁడవు. నీకు మర్యాదలు దెలియవు. మాయరూపముననే తప్ప నిజరూప ముతో శత్రువులను ఓడఁగొట్టలేవు. మారుక్మిణిని మాకిచ్చివేయుము. లేని యెడల యుద్ధములో నీకు గర్వభంగ మగునట్లు ఓడింతును.

వ. అని పలికిన నగధరుండు నగి యొక్కబాణంబున వాని
కోదండంబు ఖండించి యాఱుశరంబుల శరీరంబు దూఱనేసి
యెనిమిదివిశిఖంబుల రథ్యంబులం గూల్చి రెండమ్ముల సార
థిం జంపి మూఁడు వాఁడితూపులఁ గేతనంబుఁ ద్రుంచి మఱి
యు నొక్కవిల్లందికొనం దునిమి వెండియు నొక్కధనువు పట్టిన

విదళించి క్రమంబునం బరిఘపట్టిసశూలశరాసిశక్తితోమ
రంబులు ధరియించినం దునుకలు సేసి క్రమ్మఱ నాయుధంబు
లెన్ని యెత్తిన నన్నియు శకలంబులు గావించె నంతటఁ
దనివిసనక వాఁడు రథంబు డిగ్గి ఖడ్గహస్తుం డై దవానలంబు
పయిం బడుమిడుతచందంబునఁ గదిసిన ఖడ్గకవచంబులు చూ
ర్ణంబులు సేసి సహింపక మెఱుంగులు సెదర నడిదంబు
వెఱికి జళిపించి వానిశిరంబు దెగవ్రేయుదు నని గమకించి
నడచుచున్న నడ్డంబు వచ్చి రుక్మిణీదేవి హరిచరణారవిందం
బులు వట్టుకొని యి ట్లనియె. 88

టీ. అని, పలికినన్ = చెప్పఁగా, నగధరుండు = కొండతాల్పు (కృష్ణుఁడు), నగి=నవ్వి, ఒక్కబాణంబునన్, వానికోదండంబున్ = రుక్మిధనుస్సును, ఖండించి=నఱికి, ఆఱుశరంబులన్ = ఆఱుబాణములచేత, శరీరంబున్, దూఱన్ = దూఱునట్లు, ఏసి=వేసి, ఎనిమిదివిశిఖంబులన్ =ఎనిమిదిబాణములచేత, రథ్యంబులన్ = రథమును మోయువానిని (గుఱ్ఱములను), కూల్చి = కూలఁజేసి, రెండమ్ములన్ = రెండుబాణములచేత, సారథిన్ = బండితోలువానిని, చంపి, మూఁడు వాఁడితూపులన్ = పదునుగలమూఁడుబాణములచేత, కేతనంబున్ = టెక్కెమును, త్రుంచి = తునుకలుచేసి, మఱియున్, ఒకవిల్లు=ఒకధనుస్సును, అందినన్ =తీసికొనఁగా, తునిమి = ఖండించి, వెండియున్ =మఱియును, ఒక్కధనువుపట్టినన్ = ఒక్కధనుస్సునుపూనఁగా, విదళించి = నఱికి, క్రమంబునన్ = వరుసఁగా, పరిఘ = ఇనుపకట్లగుదియలు, పట్టిస=అడ్డకత్తులు, శూల=ముమ్మొనవాలులు, శర=బాణములు, అసి = ఖడ్గములు, శక్తి=చిల్లకోలలు, తోమరంబులు = ఆయుధవిశేషములను, ధరియించినన్ =పూనఁగా, తునుకలుచేసి, క్రమ్మఱన్ =మరల, ఆయుధంబులు, ఎన్ని యెత్తినన్ =ఎన్నిధరించినను, అన్నియున్, శకలంబులు = తునుకలు, కావించెన్, అంతటన్, తనివి = తృప్తిని, చనక = పొందక, వాఁడు = ఆరుక్మి, రథంబున్ = తేరినుండి, డిగ్గి =దిగి, ఖడ్గహస్తుండై = కత్తిచేతఁగలవాఁడై, దవానలంబుపైన్ = కారుచిచ్చుమీఁద, పడుమిడుతచందంబునన్ = పడునట్టి

మిఱుతవలె, కదిసినన్=సమీపింపఁగా, (దవానలమునకును కృష్ణునికి మిఱుత కును రుక్మికిని ఉపమానోపమేయభావము.) ఖడ్గకవచంబులు=(రుక్మియొక్క) కత్తినికవచములను, చూర్ణంబులు=పొడులు, చేసి, సహింపక=ఓర్వక, మెఱుం గులు=మిణుఁగురులు, చెదరన్=ఎగురఁగా, అడిదంబు=కత్తిని, పెఱికి = ఒఱ నుండితీసి, ఝళిపించి=ఆడించి, వానిశిరంబు=వానితలను, తెగ ద్రెయుందును=నఱు కుదును, అని, గమకించి=ప్రయత్నముచేసి, నడుచుచున్నన్=పోవుచుండఁగా, అడ్డంబు, వచ్చి, రుక్మిణీదేవి, హరిచరణ అరవిందంబులు = కృష్ణునిపాదకమల ములను, పట్టుకొని, ఇట్లు, అనియెన్.

మత్తకోకిల. నిన్ను నీశ్వరు దేవదేవుని • నిర్ణయింపఁగ లేక యో
సన్నుతామలకీర్తిశోభిత • సర్వలోకశరణ్య మా
యన్న యీతఁడు నేఁడు చేసె మ•హాపరాధము నీయెడన్
నన్ను మన్ననఁ జేసి కావు మ•నాథనాథ దయానిధీ. 89

టీ. ఓసన్నుతఅమలకీర్తిశోభిత = ఓపెద్దలచేఁ బొగడఁబడిన నిర్మల మైన కీర్తిచే వెలుఁగువాఁడా! ఈశ్వరున్ = ప్రభువును, దేవదేవునిన్ = దేవత లకు దేవుని, నిన్నున్, నిర్ణయింపఁగలేక = నిశ్చయించుకొనలేక (నీమహిమను తెలియఁజాలక యని భావము), సర్వలోకశరణ్య=ఎల్లలోకములను రక్షించు వాఁడా! నీయెడన్=నీవిషయమున, మాయన్న, ఈతఁడు, నేఁడు, మహాత్ అపరాధము=గొప్పతప్పిదమును, చేసెన్, అనాథనాథ = అనదలను రక్షించు వాఁడా! దయానిధీ = దయకు స్థానమైనవాఁడా! నన్నున్, మన్ననచేసి= గౌరవించి, కావుము=రక్షించుము.

తా. అనాథనాథుఁడవగు కృష్ణా! సర్వేశ్వరుండవగు నిన్నెఱుంగక నాయన్న రుక్మి నీవిషయమున గొప్పతప్పిదమును చేసెను. నాయందనుగ్రహ ముంచి వానిని రక్షింపుము.

మత్తకోకిల. కల్ల లే దని విన్నవించుట•గాదు వల్లభ యీతనిన్
బ్రల్లదుం డెగఁ జూచితేనియు • భాగ్యవంతుల మైతి మే
మల్లుఁ డయ్యె ముకుందుఁ డీశ్వరుఁ•డంచు మోదితులైనమా
తల్లిదండ్రులు పుత్త్రశోకము • దాల్చి చిక్కుదు రీశ్వరా. 90

టీ. ఈశ్వరా=ఐశ్వర్యముగలవాఁడా ! వల్లభ=ప్రియుఁడా ! కల్ల=తప్పు, లేదు, అని, విన్నవించుట=మనవిచేయుట, కాదు, ప్రల్లదున్=దుష్టుని, ఈతనిన్=వీనిని (రుక్మిని), తెగన్=ఖండించుటకు, చూచితివనిన్=తలఁచిన పక్షమున, ఏము, భాగ్యవంతులము=అదృష్టముగలవారము, ఐతిమి, మకుందుఁడు=కృష్ణుఁడు, ఈశ్వరుఁడు=ఐశ్వర్యముగలవాఁడు (భగవంతుఁడు), అల్లుఁడు, అయ్యెన్, అంచున్, మోదితులు = సంతోషముగలవారు, ఐన మాతల్లిదండ్రులు, పుత్రశోకమున్=కుమారునివిషయ మగు దుఃఖమును, తాల్చి=ధరించి, చిక్కుదురు=చిక్కిపోదురు (కృశింతురు).

తా. ఈశ్వరా ! నాయన్నయందు తప్పులేదని చెప్పుటకాదు. ఈ దుష్టుని మీరు చంపినయెడల నీవల్లుఁడ వగుటచే ధన్యులమని సంతసించు మా తల్లిదండ్రులు పుత్రశోకమును బొంది కృశింతురు.

మ. అని డగ్గుత్తికతో మహాభయముతో • నాకంపితాంగంబుతో
వినతశ్రాంతముఖంబుతో శ్రుతిచల • ద్వేణీకలాపంబుతోఁ
గనుదోయిం జడిగొన్న బాష్పములతోఁ • గన్యాలలామంబు
మ్రొక్కిన రుక్మిం దెగవ్రేయఁ బోక మగిడెం • గృష్ణుండు
రోచిష్ణుఁడై. 91

టీ. అని=అనిచెప్పి, డగ్గుత్తికతోన్=గద్గదస్వరముతో, మహాత్ భయముతో=గొప్పభీతితో, ఆకంపిత అంగంబుతోన్=మిక్కిలి వణకుచున్న అవయవములతో, వినతశ్రాంత ముఖంబుతోన్ = మిక్కిలి వంగినదియు బడలినదియు నగు మొగముతో, శ్రుతిచలత్ వేణీకలాపంబుతోన్ = చెవులయందుఁ గదలుచున్న వెండ్రుకలసమూహముతో, కనుదోయిన్=కన్నుల జంటయందు, జడిగొన్న బాష్పములతోన్=ఎడతెగనికన్నీళ్లతో, కన్యాలలామంబు=కన్నెలలో నుత్తమురాలు (రుక్మిణి), మ్రొక్కన్ = నమస్కరింపఁగా, కృష్ణుఁడు, రోచిష్ణుండు ఐ=ప్రకాశించువాఁడై, రుక్మిన్, తెగవ్రేయఁబోక=చంపఁబోక మగిడెన్=మరలెను.

తా. రుక్మిణి మిక్కిలి భయముతో వణఁకుచుఁ గృష్ణునికి నమస్కరింప నతఁడు రుక్మిని మన్నించెను.

వ ఇట్లు చంపక బావా రమ్మని చిఱునగవు నగుచు వానిం బట్టి బంధించి గడ్డంబును మీసంబును తలయును నొకకత్తివాతి యమ్మున రేవులువాఱ గొఱిగి విరూపుం జేసె నంతట యదువీరులు పరసైన్యంబులం బాఱఁదోలి తత్సమీపంబునకు వచ్చి రప్పుడు హతప్రాణుం డై కట్టువడి యున్నరుక్మిం జూచి కరుణఁ జేసి కామపాలుండు వానిబంధంబులు విడిచి హరి దగ్గఱి యి ట్లనియె. 92

టీ. ఇట్లు, చంపక, బావా (రుక్మిసంబోధనము) రమ్ము,అని చిఱునగవు నగుచు, వానిన్ = ఆరుక్మిని, పట్టి, బంధించి = కట్టివేసి, గడ్డంబును, మీసంబును, తలయును, ఒకకత్తివాతియమ్మునన్ = ఒకకత్తివంటివాదరగలబాణము చేత, రేవులువాఱన్ = చాళ్లుపడునట్లు, గొఱిగి, విరూపున్ = వికారరూపము గలవానిని, చేసెన్, అంతట, యదువీరులు = యాదవశూరులు, పరసైన్యంబులన్ = శత్రుసేనలను, పాఱఁదోలి = తఱిమి, తత్ సమీపంబునకున్ = కృష్ణుని దగ్గఱకు, వచ్చిరి, అప్పుడు, హతప్రాణుండై = పోయినబలముగలవాఁడై, కట్టు వడి = కట్టఁబడి, ఉన్నరుక్మిన్ = ఉన్నట్టిరుక్మిని, చూచి, కరుణన్ చేసి = దయతో, కామపాలుండు = బలరాముఁడు, వాని = ఆరుక్మియొక్క, బంధంబులు = కట్లులను, విడిపించి = విప్పి, హరిన్ = కృష్ణుని, దగ్గఱి = సమీపించి, ఇట్లు, అనియెన్.

క. తల మనక భీష్మనందను
తలయును మూఁతియును గొఱుగఁ దగవే బంధుం
దలయును మూఁతియు గొఱుగుట
తల దఱుగుటకంటెఁ దుచ్ఛతరము మహాత్మా. 93

టీ. మహాత్ ఆత్మా = గొప్పస్వభావముగలవాఁడా! (కృష్ణునిసంబోధనము,) తలము = తొలఁగుము, అనక = అనిచెప్పక, భీష్మనందను తలయును

మూఁలిరయఁను=భీష్మరాజకుమారుని (రుక్మియొక్క) తలయుఁ మూఁలిరయుఁను, గొఱిగక్, తగవుపి=న్యాయమా (కాదనియర్థము), బంధుక్ = బంధువును, తలయును, మూఁలిరయఁక్, గొఱుగుట, తలతఱుగుటకంటెక్ = తలనఱుకుట కన్నను, తుచ్ఛతరము=మిక్కిలి నీచము.

తా. కృష్ణా! అపరాధముచేసిన బంధువుని బుద్ధి చెప్పి విడుచుట ధర్మము. అట్లు చేయక తలగొఱుగుట శిరశ్ఛేదముకన్నను దుఃఖము.

క. కొందఱు రిపు లని యలుగవు
గొందఱు హితు లనుచు మేలుఁ • గూర్పవు నిజ మీ
వందఱియందును సముఁడవు
పొందఁగ నే లయ్య విషమ•బుద్ధి ననంతా. 94

టీ. అనంతా = అంతము (నాశము) లేనివాఁడా! కొందఱు, రిపులు= శత్రువులు, అని, అలుగవు = కోపపడవు, కొందఱు, హితులు=ఇష్టులు, అనుచుక్, మేలుక్, కూర్పవు=కూడఁబెట్టవు, నిజము=సత్యము, ఈవు=నీవు, అందఱియందును=శత్రువులయందును మిత్రులయందును, సముఁడవు = సమానుఁడవు, విషమబుద్ధిక్=చెడుబుద్ధిని, పొందఁగక్, ఏల, అయ్యా.

తా. కృష్ణా! నీకు శత్రువులును మిత్రువులును సమానులే కావున రుక్మియందు శత్రుత్వబుద్ధి తగదు.

వ. అని వితర్కించి పలికి రుక్మిణీదేవి నుపలక్షించి యి ట్లనియె.

టీ. అని యీప్రకారము, వితర్కించి = సంశయించి (కోపించి యని యర్థము), పలికి = చెప్పి, రుక్మిణీదేవిక్, ఉపలక్షించి = చూచి, ఇట్లు, అనియెక్.

శా. తోఁడంబుట్టినవానిభంగమునకుక్ • దుఃఖించి మాకృష్ణు నె
గ్గాడం జూడకు మమ్మ పూర్వభవక•ర్మాధీన మై ప్రాణులక్
గీడుక్ మేలును జెందు లేఁ డొకఁడు శి•క్షింపంగ రక్షింప నీ
తోఁడంబుట్టువు కర్మశేషపరిభూ•తుం డయ్యె నేఁ డిట్టెడన్.

టీ. అమ్మ=అంబా! (రుక్మిణీ), తోఁడంబుట్టినవాని భంగమునకున్ = తోఁబుట్టువగు రుక్మియవమానమునకు, దుఃఖించి=దుఃఖపడి, మాకృష్ణునిన్, ఎగ్గు=కీడుమాటలు, ఆడన్=చెప్పుటకు, చూడకుము=తలంపకుము, పూర్వభవ కర్మ అధీనము ఐ = మునుపటిజన్మమునందలి కర్మమునకు సంబంధించినదై, కీడున్, మేలును, ప్రాణులన్=జంతువులను, చెందున్=పొందును, శిక్షింపంగన్=దండించుటకును, రక్షింపన్=ప్రోచుటకును, ఒకఁడు లేఁడు. (శిక్షించువాఁడును రక్షించువాఁడును నెవరులేరని భావము.) నీతోడంబుట్టువు, నేఁడు, ఇయ్యెడన్=ఈచోట, కర్మశేషపరిభూతుండు=పూర్వకర్మముయొక్క మిగతచే నవమానింపఁబడినవాఁడు, అయ్యెన్.

తా. రుక్మిణీ! నీయన్న యవమానమునకు దుఃఖించి మాకృష్ణుని దూఱకుము; మానమును అవమానమును ప్రాణులకుఁ గర్మాధీనమై కలుగుచుండును; కావున నీయన్నయుం గర్మ నవమానింపఁబడియెను.

క. చంపెడిదోషము గలిగిన
జంపఁ జనదు బంధుజనులఁ • జను విడువంగాఁ
జంపిన దోషము సిద్ధము
చంపఁగ మఱి యేల మున్న • చచ్చినవానిన్. 97

టీ. బంధుజనులకున్, చంపెడి దోషము కలిగినన్ = చంపవలసినంత తప్పిదమున్నను, చంపన్, చనదు = కూడదు, విడువంగాన్ = విడుచుటకు, చనున్=తగును (బుద్ధిచెప్పి విడువలయునని భావము), చంపినన్, దోషము= పాపము, సిద్ధము=నిశ్చయము, మున్న అ = పూర్వమే, చచ్చినవానిన్, మఱి, చంపను ఏల=ఎందులకుఁ జంపవలెను.

తా. చంపవలసిన తప్పుచేసిన బంధువును చంపక విడిచి పెట్టవలెను. తప్పిదముచేతనే చచ్చినవానిని జంపుటవలన వానిపాపము తొలఁగి మనకు లభించును. (అని బలరాముఁడు కృష్ణునితోఁ జెప్పెను.)

ఆ. బ్రహ్మచేత భూమి•పతుల కీధర్మంబు
కల్పితంబు రాజ్య•కాంక్షఁ జేసి

తోడిచూలు సయిన • తోడఁబుట్టినవాఁడు
చంపుచుండుఁ గ్రూర • చరితుఁ డగుచు. 98

టీ. తోడఁబుట్టినవాఁడు = సోదరుఁడు, రాజ్యకాంక్షఁ జేసి = రాజ్యాపేక్షచేత, క్రూరచరితుఁడు = కఠినచరిత్రుఁడు, అగుచున్, తోడిచూలునైనన్=తోఁబుట్టువునైనను, చంపుచున్, ఉండున్, ఈధర్మంబు=ఈ (రాజ్యాపేక్షచే సోదరులనే చంపునట్టి) న్యాయము, భూమిపతులకున్ = రాజులకు, బ్రహ్మచేతన్, కల్పితంబు=ఏర్పఱుపఁబడినది.

తా. రాజ్యమునకై యన్నదమ్ములు పోరుట రాజధర్మమని బ్రహ్మచే నేర్పఱుపఁబడియున్నది. కావున మాయపరాధము లే దని బలరాముఁడు రుక్మిణికిం జెప్పెను.

క. భూమికి ధనధాన్యములకు
భామలకును మానవములకుఁ • బ్రాభవములకుం
గామించి మీఁదుఁ గానక
శ్రీమదమున మానఘనులు • చెనకుదు రొరులన్. 99

టీ. మానఘనులు=మానముచే గొప్పవారలు (రాజులు), భూమికిన్ = రాజ్యమునకు, ధనధాన్యములకున్, భామలకును=స్త్రీలకొఱకును, మానములకున్=మర్యాదలకును, ప్రాభవములకున్ = పరాక్రమములకును, కామించి=కోరి, శ్రీమదమునన్=సిరియొక్క మత్తుచేత, మీఁదు కానక=ముందిచెడుఁగులను యోచింపక, ఒరులన్=ఇతరులను (శత్రువులను), చెనకుదురు=ఎదిరింతురు.

తా. మానముగలరాజులు రాజ్యము మొదలగువానికై శత్రువులతోఁ బోరుదురు. అయినను మనకిది తగ దని బలరాముఁడు కృష్ణునితోఁ జెప్పెను.

వ. వినుము దేవమాయం జేసి దేహాభిమాను లైనమానవులకుఁ బగవాఁడు బంధుం డుదాసీనుం డనుభేదంబు మోహాంబున సిద్ధంబయి యుండు జలాదులయందుఁ జంద్రసూర్యాదులును ఘటాదులందు గగనంబును బెక్కు లయి కానంబడు

భంగి దేహధారుల కందఱకు నాత్మ యొక్కఁడయ్యును
బెక్కండ్రై తోఁచు నాద్యంతంబులు గలయీదేహంబు
ద్రవ్యప్రాణగుణాత్మకం బయి యాత్మయందు నవిద్యచేతఁ
గల్పితంబై దేహిని సంసారంబునం ద్రిప్పు సూర్యుండు తట
స్థుండై యుండఁ బ్రకాశమానంబులైనదృష్టిరూపంబులుం
బోలె నాత్మ తటస్థుండై యుండ దేహేంద్రియంబులు
ప్రకాశమానంబు లగునాత్మకు వేఱొక్కటితోడ సంయోగ
వియోగంబులు లేవు; వృద్ధిక్షయంబులు చంద్రకళలకుం
గాని చంద్రునకు లేనికైవడి జన్మనాశంబులు దేహంబునకుం
గాని యాత్మకుఁ గలుగనేరవు; నిద్రవోయినవాఁ డాత్మను
విషయఫలానుభవంబులు సేవించుతెఱంగున నెఱుకలేని
వాఁడు నిజముగాని యర్థంబునందును ననుభవంబు నొందు
చుండుఁ గావున. 100

టీ. వినుము, దేవమాయం జేసి=ఈశ్వరమాయచేత, దేహఅభిమానులు
=శరీరమునం దాత్మబుద్ధిగలవారు. అయినమానవులకున్ = అయినట్టి మనుష్యు
లకు, పగవాఁడు=శత్రువు, బంధుండు = బంధువు, ఉదాసీనుండు = సంబం
ధము లేనివాఁడును, అనుభేదంబు = అనునట్టిభేదబుద్ధి, మోహంబునన్ =
అజ్ఞానముచేత, సిద్ధంబువి = ఆయత్తమైనదై, ఉండున్, (ప్రాణులకు శత్రు
వనియుం మిత్రుండనియుం నుదాసీనుం డనియుం నిట్టిభేదబుద్ధి యజ్ఞానముచేఁ
గలిగినదని భావము ) జలాదులయందున్ = నీరు మొదలుగాఁగలవానియందు,
చంద్ర సూర్యాదులును, ఘటఆదులయందున్ = కుండలోనగు వానియందు,
గగనంబును=ఆకాశంబును, పెక్కులై కానంబడుభంగిన్ = అనేకములై
కనఁబడునట్లు, దేహధారులకున్=జంతువులకు, అందఱకు, ఆత్మ = జీవుఁడు,
ఒక్కఁడు, అయ్యును, పెక్కండ్రువి = అనేకవిధములై, తోఁచున్,
(సూర్యుఁడును చంద్రుఁడును ఒక్కొక్కఁడయ్యును, జలాదులయందు ననే
కులుగాఁ గనఁబడునట్లు ఆకాశ మొక్కటియయ్యును ఘటాదులయందుఁ

బెక్కువిధములుగాఁ గనఁబడునట్లు నాత్మ యొక్కఁడయ్యును దేహధారులకు ననేకవిధములుగాఁ దోఁచుచుండు నని భావము.) ఆదిఅంతంబులు = మొదలును చివరయును (పుట్టువును నాశనమునను), కలతీదేహంబు=కలిగిన యీశరీరము, ద్రవ్యప్రాణగుణ ఆత్మకంబుఐ = పృథివ్యాదులును ఇంద్రియములును సత్త్వరజస్తమోగుణంబులును స్వరూపముగాఁగలదై (అధిభూతము, అధ్యాత్మము, అధిదైవము ననురూపములు కలదిగ్గాయనుట.),ఆత్మయందున్ = జీవునియందు, అవిద్యచేతన్ = అజ్ఞానము చేత, కల్పితంబై=కల్పింపఁబడినదై, దేహిని=ప్రాణిని, సంసారంబునన్, త్రిప్పున్ = తిరుగఁజేయును. (ఉత్పత్తి నాశములుగల యీశరీరము పంచభూతములు పంచేంద్రియములు త్రిగుణములు వీని వికారము కలదై యజ్ఞానముచేఁ గల్పితంబై దేహిని సంసారమునఁ ద్రిప్పుచుండు నని భావము.) సూర్యుండు, తటస్థుండు=ఉదాసీనుండు, ఐ, ఉండన్, ప్రకాశమానంబులు = ప్రకాశించునవి, అయినదృష్టిరూపంబులుం బోలెన్ = అయినట్టి నేత్రములును, సౌందర్యాదులునువలె, ఆత్మ = జీవుఁడు, తటస్థుండై=ఉదాసీనుండై, ఉండన్, దేహేంద్రియంబులు = శరీరమును నింద్రియములును, ప్రకాశమానంబులు = వెలుఁగుచున్నవి, అగున్, (సూర్యుఁ డుదాసీనుండై యుండఁ దైజసేంద్రియములగు చక్షూరూపములు ప్రకాశించునట్లు ఆత్మ దేహమునం దుండఁగా నింద్రియములు ప్రకాశించుచుండు నని భావము.) ఆత్మకున్ = జీవునకు, వేఱు ఒక్కటితోడన్ =మఱియొకవస్తువుతో, సంయోగ వియోగంబులు=చేరికయును ఎడబాటును, లేవు, (శుద్ధుండగు నాత్మకు మఱియొకవస్తువు సంబంధము లేదనిభావము.) వృద్ధిక్షయంబులు = ఎక్కువతక్కువలు, చంద్రకళలకుంగాని=చంద్రకళలకేతప్ప, చంద్రునికి లేనికైవడిన్ = చంద్రునికి లేనియట్లు, జన్మనాశంబులు = జననమరణములు, దేహంబునకుంగాని = శరీరమునకేతప్ప, ఆత్మకున్ = జీవునికి, కలుగనేరవు, (చంద్రకళలకు నాశము గలుగుటచే నమావాస్యనాఁడు చంద్రుఁడున్నను లేఁడనుట యెట్లో అట్లు దేహమునకుఁ గలుగు జన్మనాశములు ఆత్మకు, జెప్పఁబడినవిగాని చంద్రునికి నాశము లేనట్లు ఆత్మకును నాశము లేదని భావము.) నిద్రపోయినవాఁడు = నిద్రించువాఁడు, ఆత్మను=మనస్సు

నందు, విషయఫల అనుభవంబు = విషయసుఖములను (వానివలనఁగలుగు సుఖదుఃఖఫలానుభవములును), సేవించు తెఱంగునన్ = అనుభవించురీతిని, ఎఱుకలేనివాఁడు = జ్ఞానములేనివాఁడు, నిజముకాని అర్థంబునందున్ = అసత్యమగు నీసంసారమునందు, అనుభవంబు = సంబంధము, ఒందుచున్, ఉండున్ (నిద్రించువాఁడు స్వప్నమునందు, విషయసుఖముల ననుభవించునట్లు జ్ఞానములేనివాఁడు సంసారసుఖములం గోరి మరల మరలఁ బుట్టుచుండునని భావము.) కావునన్ = ఆహేతువుచే.

క. అజ్ఞానజ మగుశోకము
విజ్ఞానవిలోకనమున ♦ విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే
యజ్ఞానులభంగి వగవ ♦ నంభోజముఖీ. 101

టీ. అంభోజముఖీ = కమలములవంటి ముఖముకలదానా (రుక్మిణీ)! అజ్ఞానజము = అజ్ఞానమువలనఁ గలిగినది, అగుశోకమున్ = అయినట్టి దుఃఖమును, విజ్ఞాన విలోకనమునన్ = జ్ఞానదృష్టిచేత (తత్త్వజ్ఞానముచే ననుట), విడువుము = వదలుము, ప్రజ్ఞావతికిన్ = బుద్ధిగలదానికి, అజ్ఞానులభంగిన్ = జ్ఞానములేనివారివలె, నీకున్, వగవన్ = చింతింపను, తగునే (తగదని యర్థము.)

తా. బుద్ధిమంతురాలవగు నీకు నవివేకులవలె దుఃఖించుట యుక్తము కాదు. తత్త్వజ్ఞానముచే నట్టిశోకమును విడువుము.

వ. ఇట్లు బలభద్రునిచేతఁ దెలుపంబడి రుక్మిణీదేవి దుఃఖంబు
మాని యుండె నట రుక్మి యనువాఁడును బ్రాణావశిష్టుండై
విడువంబడి తనవిరూపభావంబునకు నెరియుచు హరిని గెలిచి
కాని కుండినపురంబు సొర నని ప్రతిజ్ఞ సేసి తత్పురసమీపం
బున నుండె నివ్విధంబున. 102

టీ. ఇట్లు = ఈప్రకారము, బలభద్రునిచేతన్ = బలరామునిచేత, తెలుపంబడి = తెలియంజేయఁబడి, రుక్మిణీదేవి, దుఃఖంబున్, మాని = విడిచి, ఉండెన్, అటన్ = అక్కడ, రుక్మియనువాఁడును, ప్రాణ అవశిష్టుండై =

ప్రాణములు మాత్రము మిగతగాఁగలవాఁడై, తనవిరూపభావంబునకున్ = తన వికారరూపము కలిగియుండుటకు, ఎరియుచున్ = పరితపించుచు, హరిన్ = కృష్ణుని, గెలిచికాని, కుండినపురంబు, చొరను=ప్రవేశింపను, అని, ప్రతిజ్ఞ = శపథమును, చేసి, తత్పురసమీపంబునన్ = ఆకుండినపురముదగ్గఱ, ఉండెన్, ఇవ్విధంబునన్ = ఈప్రకారముగా,

క. రాజీవలోచనుఁడు హరి
రాజసమూహముల గెలిచి • రాజస మొప్పన్
రాజిత యగుతనపురికిని
రాజాననఁ దెచ్చె బంధు• రాజి నుతింపన్. 103

టీ. రాజీవలోచనుఁడు = కమలములవంటి కన్నులుగలవాఁడు, హరి = కృష్ణుఁడు, రాజసమూహములన్ = రాచమూఁకలను, గెలిచి, రాజసము = గొప్పతనము, ఒప్పన్ = ప్రకాశింపఁగా, రాజిత = వెలుఁగుచున్నది, అగుతన పురికిన్ = అగునట్టి తనపట్టణమునకు (ద్వారకకు), రాజ ఆననన్ = చంద్రుని వంటి మోముకలదానిని (రుక్మిణిని), బంధురాజి = బంధువులసమూహము, నుతింపన్ = పొగడఁగా, తెచ్చెన్.

తా. శత్రురాజులను గెలిచి కృష్ణుఁడు రుక్మిణిని తనవా రందఱకు సంతోషము కలుగునట్లు ద్వారకకుఁ దెచ్చెను.

వ. అంత నయ్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధవివాహకృత్యంబును బ్రవర్తమానగీతవాద్యనృత్యంబును బ్రతిగృహాలంకృతాశేషనరనారీవర్గంబును బరిణయమహోత్సవ సమాహూయమాన మహీపాలగజఘటా గండమండలదానసలిల ధారాసిక్తరాజమార్గంబును బ్రతిద్వారమంగళాచారసంఘటితక్రముకకదళికాకర్పూరకుంకుమాగరు ధూపదీపపరిపూర్ణకుంభంబును విభూషితసకలగృహవేదికా కవాట గేహళి స్తంభంబునువిచిత్రకుసుమాంబరరత్నతోరణవిరాజితంబును

సముద్ధూతకేతనవిభ్రాజితంబును నై యుండె నయ్యవసరం
బున. 104

టీ. అంతట, అయ్యాదవేంద్రుని నగరంబు = ఆయదుశ్రేష్ఠుని (కృష్ణుని) పట్టణము, సమారబ్ధవివాహకృత్యంబును = ఆరంభింపఁబడిన పెండ్లి పనులు కలదియును, ప్రవర్తమానగీతవాద్యనృత్యంబును=జరుగుచున్న గానమును వాద్యములును నాటలను గలదియును, ప్రతిగృహ=ప్రతియింటియందును, అలంకృత = అలంకరింపఁబడిన, అశేష=సమస్తమైన, నర=పురుషులయు, నారీ=స్త్రీలయు, వర్గంబును=సమూహముకలదియును, పరిణయ=వివాహమనెడి, మహత్ ఉత్సవ = గొప్పపండుగుకొఱకు, సమాహూయమాన=పిలువఁబడిన, మహీపాల=రాజులయొక్క, గజ=ఏనుఁగులయొక్క, ఘటా=గుంపులయొక్క, గండ=చెక్కిళ్లయొక్క, మండల = ప్రదేశములయొక్క, దానసలిల=మదోదకముయొక్క, ధారా=నీటిచాలుచేత, సిక్త=తడుపఁబడిన, రాజమార్గంబును = రాజవీథులుకలదియును, ప్రతిద్వార=ప్రతివాకిటియందును, మంగళ=శుభము కొఱకును, ఆచార=నడవడికలచే, సంఘటిత=కూర్పఁబడిన, క్రముక=పోఁక చెట్లును, కదళికా=అరఁటిచెట్లును, కర్పూర=కప్పురమును, కుంకుమ=కుంకుమమును, అగరు=అగరుచెక్కలయొక్క, ధూప=పొగయును, దీప=దీపములును, పరిపూర్ణకుంభంబును=నిండుకుండలుకలదియును,విభూషిత= అలంకరింపఁబడిన, సకల=సమస్తములైన, గృహ=ఇండ్లయొక్క, వేదికా=అరుఁగులును, కవాట= తలుపులును, గేహళీ=గడపలును, స్తంభమును = కంబములుకలదియును, విచిత్ర=నానావిధములగు, కుసుమ = పువ్వులచేతను, అంబర=వస్త్రములచేతను, రత్న=రత్నములయొక్క, తోరణ=తోరణములచేతను, విరాజితంబును=వెలుంగుచున్నదియును, సముద్ధూత కేతన విభ్రాజితంబును = పైకెగురఁగొట్టఁబడిన కేతనములచే వెలుంగుచున్నదియునై, ఉండెన్, అయ్యవసరంబునన్ = ఆసమయమునందు.

మ. ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతోహారిణిన్ మానవై
భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసంపత్కారిణిన్ సాధుబాం
ధవసత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్యసంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతీచూడామణిన్ రుక్మిణిన్.

టీ. హరి=కృష్ణుఁడు, ధ్రువకీర్తిన్=నిలుకడయగుకీర్తికలదానిని, నిజచేతః హారిణిన్=తనమనస్సును హరించుదానిని, మానవైభవగాంభీర్యవిహారిణిన్=చిత్తౌన్నత్యము చేతను విభవము చేతను గంభీరభావము చేతను విహరించుదానిని, నిఖిలసంపత్కారిణిన్=సమస్తములగు సంపదలు కలుగఁజేయుదానిని, సాధుబాంధవ సత్కారిణిన్=సజ్జనులను బంధుగులను సన్మానించుదానిని, పుణ్యచారిణిన్=పుణ్యముచేయుదానిని, మహత్ దారిద్ర్యసంహారిణిన్=గొప్పపేదరికమును బోఁగొట్టుదానిని, సువిభూషాంబరధారిణిన్ = మంచి సొమ్ములను బట్టలను ధరించుదానిని, గుణవతీచూడామణిన్=గుణవంతురాండ్ర తలమానికమును, రుక్మిణిన్, పెండ్లియాడెన్.

తా. సకలసౌభాగ్యవతి యగు రుక్మిణిని కృష్ణుఁడు నిశ్చలమగు యశస్సుతోఁ బెండ్లాడెను.

క. సతులుం దారును బౌరులు
హితమతిఁ గానుకలు దెచ్చి యిచ్చిరి కరుణో
న్నతవర్ధిష్ణులకును మా
నితరోచిష్ణులకు రుక్మిణీకృష్ణులకున్. 106

టీ. సతులున్=స్త్రీలును, తారును=తాము, పౌరులు=పట్టణములోనిజనులు, హితమతిన్ = మంచిబుద్ధితో, కానుకలు=కట్నములను, కరుణఉన్నత వర్ధిష్ణులకున్ = దయచే నెక్కువ వృద్ధిగలవారికి, మానితరోచిష్ణులకున్=గౌరవింపఁబడినకాంతిగలవారికి, రుక్మిణీకృష్ణులకున్, తెచ్చి, ఇచ్చిరి.

తా. ద్వారకయందలివా రందఱును రుక్మిణీకృష్ణులకు కానుకలు దెచ్చి యిచ్చిరి.

క. హరిపెండ్లికిఁ గైకేయక
కురుసృంజయయదువిదర్భ•కుంతినరేంద్రుల్
పరమానందముఁ బొందిరి
ధరణీశులలోన గాఢ•తాత్పర్యమునన్. 107

టీ. హరిపెండ్లికిన్ = కృష్ణుని వివాహమువలన, కైకేయక కురుసృంజయ యదు విదర్భ కుంతి నర ఇంద్రుల్-ఈదేశములరాజులు, ధరణీశులలోనన్=రాజులలోపల, గాఢతాత్పర్యములన్ = ఎక్కువ అభిప్రాయములతో, పరమఆనందమున్=మిక్కిలిసంతోషమును, పొందిరి.

తా. కృష్ణుఁడు పెండ్లియాడెనని విని యనేకదేశములరాజులు సంతోషమును బొందిరి.

క. హరి యీతెఱఁగున రుక్మిణి
నరుదుగఁ గొనివచ్చి పెండ్లి•యాడుట విని దు
ష్కరకృత్య మనుచు వెఱఁగం
దిరి రాజులు రాజసుతులు • దిక్కులనెల్లన్. 108

టీ. హరి=కృష్ణుఁడు, ఈతెఱఁగునన్=ఈరీతిని, రుక్మిణిన్, అరుదుగన్ = ఆశ్చర్యముగా, కొనివచ్చి, పెండ్లియాడుటన్, విని, దిక్కులన్ ఎల్లన్=అన్నిదిక్కులయందును, రాజులు, రాజసుతులు = రాజపుత్త్రులు, దుష్కర కృత్యము=చేయనలవిగాని కార్యము, అనుచున్, వెఱఁగు = ఆశ్చర్యమును, అందిరి=పొందిరి.

తా. కృష్ణుఁ డీరీతి రుక్మిణిం గొనివచ్చి వివాహమగుట అసాధ్యకార్యమని దిక్కులయందలి రాజులును రాజపుత్త్రులును తలంచిరి.

ఆ. అనఘ యాదిలక్ష్మి • యైనరుక్మిణితోడఁ
గ్రీడ సలుపుచున్న • కృష్ణుఁ జూచి
పట్టణంబులోని • ప్రజ లుల్లసిల్లిరి
ప్రీతు లగుచు ముక్త•భీతు లగుచు. 109

టీ. అనఘ=పాపము లేనివాఁడా! (ఇది పరీక్షీతునిసంబోధనము.) ఆదిలక్ష్మి=మొదటిలక్ష్మి, ఐనరుక్మిణితోడన్ = అయినట్టి రుక్మిణితోఁగూడ, క్రీడ=విహారమును, సలుపుచున్నకృష్ణున్=చేయుచున్నకృష్ణుని, చూచి, పట్టణంబులోని ప్రజలు, ప్రీతులు=ప్రేమగలవారు, అగుచున్, ముక్తభీతులు=విడువఁబడినభయముగలవారు, అగుచున్, ఉల్లసిల్లిరి=సంతోషించిరి.

తా. రుక్మిణీకృష్ణు లన్యోన్యముగా నుండుటను జూచి ఆపట్టణములోని జనులు సంతసించినవారును నిర్భీతులు నైరి.

వ. అని యిట్లు చెప్పి. 110

టీ. అని యిట్లు చెప్పి=ఇట్లు శుకమహర్షి పరీక్షీతునకుఁ జెప్పి.

క. కువలయరక్షాతత్పర<br>
కువలయదళనీలవర్ణ • కోమలదేహా<br>
కువలయనాథశిరోమణి<br>
కువలయజనవినుత విమల • గుణసంఘాతా. 111

టీ. కువలయరక్షాతత్పర = భూమినిరక్షించుటయందు నాసక్తిగలవాఁడా! కువలయదళనీలవర్ణ కోమలదేహా = కలువరేకులవలె నల్లనిచాయగల మనోజ్ఞ మగుశరీరముగలవాఁడా! కువలయనాథశిరోమణి=పుడమిఱేండ్లయొక్క తలమానికమా! కువలయజనవినుతవిమలగుణసంఘాతా = భూమండలము నందలిజనులచేఁ బొగడఁబడిన నిర్మలమైన గుణములయొక్క సమూహముగల వాఁడా!

తా. భూమి నత్యాదరముతో కాపాడువాఁడా! సుకుమారమైననల్లని దేహముగలవాఁడా! రాజులయందు శ్రేష్ఠుఁడా! ఎల్లజనులచేతనుఁ గొనియాడఁదగిన నిర్మలమైనగుణములు గలిగినవాఁడా! ఓ శ్రీరామచంద్రా.

మాలిని. సరసిజనిభహస్తా • సర్వలోకప్రశస్తా<br>
నిరుపమశుభమూర్తీ • నిర్మలారూఢకీర్తీ<br>
పరహృదయవిదారీ • భక్తలోకోపకారీ<br>
గురుబుధజనతోషీ • ఘోరదైతేయశోషీ. 112

టీ. సరసిజనిభహస్తా=కమలములఁబోలిన చేతులుగలవాఁడా! సర్వలోకప్రశస్తా=ఎల్లలోకములయందుఁ బ్రసిద్ధిఁజెందినవాఁడా! నిరుపమశుభమూర్తీ=సాటిలేనిదియుం మంగళము నగు దేహముగలవాఁడా! నిర్మలఆరూఢకీర్తీ=దోషరహితమై ప్రసిద్ధికెక్కిన కీర్తిగలవాఁడా! పరహృదయవిదారీ=శత్రువుల గుండెలను జీల్చువాఁడా! భక్తలోకోపకారీ=భక్తజనుల సమూహమునకు నుపకారముఁజేయువాఁడా! గురుబుధజనతోషీ=గురువులను పండితజనులను సంతోషపెట్టువాఁడా! ఘోరదైతేయశోషీ=భయంకరులగు రాక్షసులను జంపువాఁడా! (ఇవి కృతిపతి యగు శ్రీరామునిసంబోధనములు.)

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసన మంత్రిపుత్త్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతం బైన శ్రీమహాభాగవతం బనుపురాణంబునందు రుక్మిణీజననంబును రుక్మిణీసందేశంబును వాసుదేవాగమనంబును రుక్మిణీగ్రహణంబును రాజలోకపలాయనంబును రుక్మియనువానిభంగంబును రుక్మిణీకల్యాణంబును అనుకథలు గల దశమస్కంధంబునందుఁ బూర్వభాగము సమాప్తము.

టీ. శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర=సంపద్యుక్తుఁ డగుపరమేశ్వరుని దయచేఁ బొందఁబడిన కవిత్వముయొక్క విచిత్రము కలవాఁడును, కేసనమంత్రిపుత్త్ర = కేసనామాత్యుని కుమారుఁడును, సహజపాండిత్య=స్వభావముచేఁ గలిగినపాండిత్యము గలవాఁడును, పోతనామాత్యప్రణీతంబు=పోతనమంత్రిచేఁ జేయఁబడినది, ఐన శ్రీమహాభాగవతంబు, అనుమహాపురాణమునందుఁ, రుక్మిణీజననంబును = రుక్మిణీదేవి పుట్టుకయును, రుక్మిణీ సందేశంబును=రుక్మిణీసమాచారమును, వాసుదేవ ఆగమనంబును=కృష్ణుని రాకయును, రుక్మిణీగ్రహణంబును=రుక్మిణి నెత్తుకొనిపోవుటయును, రాజలోకపలాయనంబును=రాజులెల్లరు పరుగెత్తుటయును, రుక్మియనువానిభంగంబును, రుక్మిణీకల్యాణంబును, అనుకథలు గల దశమస్కంధంబునందుఁ బూర్వభాగము సమాప్తము.



# విషయసంగ్రహము.



**పరీక్షిన్మహారాజు:—**

ఇతఁడు అర్జునుని పౌత్త్రుఁడు. అభిమన్యుని పుత్త్రుఁడు. ఈతఁడు శాప భీతిచే సముద్రమధ్యంబున నొంటిస్తంభపు మేడ నొకదానిని నిర్మించుకొని యచ్చట ననేకఋషులవలనఁ బుణ్యకథాకాలక్షేపము గావించుచుండెను. ఇట్టికాలంబుననే శ్రీశుకమహర్షి భాగవతకథను పరీక్షిత్తున కుపదేశముం జేసెను. తుదకీతఁడు సర్పదష్టుండైయే మృతినొందెను.

**భీష్మకుఁడు:—**

ఇతఁడు విదర్భదేశమందలి కుండినపురంబునకు రాజు, రుక్మిణితండ్రి.

**రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులు:—**

భీష్మకునికుమారులు, రుక్మిణి యన్నలు.

**రుక్మిణి:—**

భీష్మకునికూఁతురు, శ్రీకృష్ణునిభార్య.

**శ్రీకృష్ణుఁడు:—**

ద్వారకానగరాధినాథుఁడు, విష్ణుదేవుని యవతారపురుషుఁడు, రుక్మిణీదేవి ప్రాణవల్లభుఁడు.

**బలరాముఁడు:—**

శ్రీకృష్ణుని యన్న, ఆదిశేషుని యవతారపురుషుఁడు.

**శిశుపాలుఁడు:—**

చేదిదేశపురాజు. ఇతఁడు నాల్గుచేతులతోను నొసటికంటితోను బుట్టెను. అప్పుడు తల్లిదండ్రులు భయపడఁగా అశరీరవాణి "ఎవరు ఎత్తు

కొనునప్పుడు వీని లలాటనేత్రమును రెండు చేతులును పోవునో వాఁడు "వీనినిఁ జంపును" అనిచెప్పెను. అంత నొకనాఁడు కృష్ణుఁ డెత్తుకొనఁగా నవి మాయమై పోయెను. అంత కృష్ణుఁ డీతని సంహరించునని లోకులు తలంచుచుండిరి. ఈతనికే రుక్మిణినిచ్చి పెండ్లి సేయవలయునని రుక్మి యనువాని తలంపు. అది కొనసాగకపోయెను. ధర్మరాజు చేసిన రాజసూయంబున నీతఁడు శ్రీకృష్ణునిచే సంహరింపఁబడెను.

దంతవక్త్రుఁడు:—

వృద్ధశర్మునికి వసుదేవుని చెలియలగు శ్రుతదేవియందుఁ బుట్టినవాఁడు, ఈతఁడుకూడ శ్రీకృష్ణునిచే సంహరింపఁబడెను.

జరాసంధుఁడు:—

మగధదేశపురాజు, బృహద్రథునికొడుకు. ఇతఁడుపుట్టినప్పుడు ఇద్దఱు తల్లులయందు సగము సగముగాఁ బుట్టెను. అంత దాదులు ఆఖండములను ఊరిముందటిచదుకమున వైచిరి. అంత నచ్చటనుండి జర యను రాక్షసి ఆహారమునుగోరి ఆరెండు ఖండముల నొకటిగాఁ జేర్చఁగా నవి కలసికొని బాలుఁడై యేడ్వసాగెను అదిమొదలా శిశువు జర యనురాక్షసిచే సంధింపఁబడుటంజేసి జరాసంధుండని చెప్పంబడియె. ఈతఁడు శ్రీకృష్ణునియందు బద్ధద్వేషమును వహించి అనేకపర్యాయములు శ్రీకృష్ణునిపై దండయాత్రల సాగించెను. ధర్మరాజు రాజసూయమును జేయుటకు ముందు భీముఁడు శ్రీకృష్ణార్జునుల సాహాయ్యంబున జరాసంధుని సంహరించెను.

సాల్వుఁడు:—

ఇతఁడు శిశుపాలునితమ్ముఁడు. శ్రీకృష్ణుఁడు శిశుపాలుని జంపుటవలన శివునిగూర్చి తపముచేసి సకలమాయలను గల్పించు శక్తియుఁ ఆకా

శమునఁ జరించునట్టి సౌంభకమను విమానమును బడసి యాదవులను హింసించుచుండఁగాఁ గృష్ణుఁడు వీనిం జంపెను.

విదూరథుఁడు:—

ఇతఁడు కురువంశమునఁ బుట్టినవాఁడు, సురథుని కొడుకు.

పౌండ్రకుఁడు:—

బలిచక్రవర్తికుమారుఁడగు పుండ్రుని కొడుకు.

## పూర్వకథాసందర్భములు.

నగధరుఁడు:—

శ్రీకృష్ణుఁడు ఇంద్రునిఁ బరిభవించుటకై తనగోవుల సంరక్షించు కొఱకును గోవర్ధనగిరిని తనచిటికెనవ్రేలితో నెత్తి గోవులను కాపాడి ఇంద్రుని పరిభవించెనని పూర్వకథ.

ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్గొన్న చందంబునన్:—

కశ్యపప్రజాపతిభార్యలగు కద్రూవినతలు ఒకవిషయంబునఁ బంతము పట్టి యందు వినత యోడిపోయి యేనూఱుసంవత్సరములు కద్రువకు దాస్యంబు చేయుచుండెను. అంతఁ గొన్నాళ్లకు వినతకు గరుడుండు పుట్టి కద్రువకు దాస్యము తొలఁగునట్టియుపాయము వేఁడఁగా నామె అమృతము దెచ్చియిచ్చిన నీదాస్యము తొలఁగునని చెప్పెను. అప్పు డాగరుడుండు స్వర్గంబునకుంబోయి ఇంద్రుంగెల్చి యమృతముం గొనివచ్చి కద్రువ కిచ్చె నని భారతము.

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1928